శ్రీ పరాశరభట్టరు అనుగ్రహించిన

# శ్రీరంగరాజస్తవము పూర్వశతకము


వ్యాఖ్యానము : 'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అ*ప్పు*గ శింగరాచార్యస్వామి.

ప్రథమ ముద్రణ : 1999

ద్వితీయ ముద్రణ : 2024

ప్రతులు : 500

మూల్యం : అమూల్యం



ఈ గ్రంథము శ్రీమాన్ పేరిచర్ల కృష్ణమూర్తి రాజు గారు, శ్రీమతి లక్ష్మి యతిరాజ వల్లి గారు సమర్పించిన పవిత్ర ద్రవ్యముతో **"ఉభయవేదాంతభాస్కర", "న్యాయవేదాంతవిద్వాన్"**, ఉ. వే. శ్రీమాన్. ఈయుణ్ణి రంగాచార్య స్వామివారి పవిత్ర స్మృతిచిహ్నంగా ముద్రించబడినది.


**నిత్యం శ్రీపతిదివ్యభవ్యసుగుణస్తోమస్వరూపాదిక**
**స్తోత్రాణా మనుసందధిం ప్రగుణితానందాంతరంగా సతీ**
**కుర్వంతీ జయతాత్సదా కరుణయా శ్రీరంగిణో2వ్యాజయా**
**గోష్ఠీయం సతతం యతీశ సహజప్రీతిప్రకర్షాస్పదా.**

# విషయసూచిక

# పూర్వశతక విషయసూచిక





శ్రీమతే రామానుజాయ నమః

# స్వగతమ్

★★★

**క్వ శ్రీభట్టార్య సూక్తిః శ్రుతి శత మహితావశ్యవిజ్ఞేయనానా–**
**ధ్వన్యర్థాలంకృతీద్ధా నవనవవిలసద్వృత్తరమ్యాఽ తిగాఢా?**
**క్వాహం క్వాహం వరాకః పరిమితధిషణో యుక్తశబ్దప్రయోగే,**
**తస్యా వ్యాఖ్యానయత్నో మమ భవతి తతో ఽ యం విదాం హాస్యపాత్రమ్.**

**అథాప్యయం ప్రయతతే సార్థక్యాయ జనేరితి,**
**సంతః పశ్యంతు మే యత్నం వాత్సల్యగుణశాలినః.**

★★★★

గీతాచార్యులడు భగవద్గీతలో **"మత్తః స్మృతిః జ్ఞాన మపోహనం చ"** (నావల్లనే స్మృతి, జ్ఞానం, ఆ జ్ఞానం తొలగిపోవడం అనేవి ఏర్పడతాయి) అని అన్నాడు. జీవుల సకలప్రవృత్తి, నివృత్తులకు, ప్రవృత్తకార్యం నెరవేరడానికి, పూర్తి కాకపోవడానికి భగవత్సంకల్పమే మూలకారణం.

25 సంవత్సరాల క్రితం, పితామహపాదుల, మహా విద్వాన్ శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి శతాబ్ద పూర్తి ఉత్సవాల దివ్యస్మృతిగా దాసుని ఈ శ్రీరంగరాజస్తవం పూర్వ శతక వ్యాఖ్యానం వరివస్య ముద్రణ జరిగింది. దానికి కారణం భగవత్సంకల్పం అనుకూలంగా ఉండడం.

వెంటనే త్వరలోనే ఉత్తర శతకానికి కూడా వ్యాఖ్యానాన్ని పెద్దల అంగీకారంతో శ్రీరంగనాథుని సన్నిధిలో సమర్పించాలని దాసుడు

అభిప్రాయపడ్డాడు. కానీ, ఆ కైంకర్యం ఇప్పటివరకు కార్యరూపం దాల్చలేదు. దానికి హేతువు భగవత్సంకల్పం అనుకూలంగా లేకపోవడమే కదా.

ఈ పూర్వశతకవ్యాఖ్యానాన్ని కూడా 15 సంవత్సరాల క్రితం తిరిగి ముద్రించాలనే ఒక ప్రయత్నం జరిగింది. కానీ, అది కూడా నెరవేరలేదు. దానికి కూడా కారణం భగవత్ సంకల్పం అనుకూలంగా లేకపోవడమే.

ఇప్పుడు దాసుని ప్రయత్నం లేకుండానే పూర్వశతకవ్యాఖ్యాన పునర్ముద్రణ జరుగుతున్నది. దీనికి కూడా భగవత్సంకల్పం అనుకూలంగా ఉండడమే.

ఉత్తరశతకానికి వ్యాఖ్యను సిద్ధం చేసి ఇప్పటికీ 13 సంవత్సరాలు అయినది. భగవానుని సంకల్పం అనుకూలంగా ఉంటే, త్వరలో ఉత్తర శతక ముద్రణ పూర్తి అవుతుందని ఆశపడుతున్నాను.

ఇంకొక అనూహ్యమైన విషయం ఏమంటే, ఏ గ్రంథం శ్రీపితామహపాదుల దివ్యస్మృతిగా ముద్రింపబడిందో, మళ్లీ అదే గ్రంథం, శ్రీతాతపాదుల భవ్యస్మృతిగా వారి అభిమానానికి పాత్రులైన శ్రీమతి లక్ష్మీయతిరాజవల్లిగారి ద్వారా పునర్ముద్రింపబడడం. . దీనికి భగవంతుని నిర్హేతుకకృపయే కారణం. భగవానుడు "**భూత భవ్యభవత్ప్రభువు**" కదా.

దాసుని పితృపాదులు, "**ఉభయవేదాంతభాస్కర**", "**న్యాయవేదాంతవిద్వాన్**", **ఉ. వే. శ్రీమాన్. ఈయుణ్ణి రంగాచార్య** స్వామివారి కటాక్షానికి పాత్రమైన ఈ వ్యాఖ్యానం మళ్ళీ ముద్రింపబడడం, అది కూడా వారి భవ్యస్మృతిగా ముద్రింపబడడం వారి ముఖోల్లాసానికి హేతువు కాగలదని

నమ్ముతున్నాను. ఈ ప్రయత్నానికి తమ అంగీకారాన్ని, మంగళాశాసనాలను అందజేసిన శ్రీమతి కె. వి. జానకమ్మగారికి ధన్యవాద సమర్పణను చేసుకుంటున్నాను.

మొదటిసారి ఈ వ్యాఖ్యానం ముద్రింపబడినప్పుడు, ఇది, మహా మహోపాధ్యాయ ఉ. వే శ్రీమాన్ వరంగల్ ఎస్. ఎన్. సి రఘునాథాచార్యస్వామివారు, తిరుపతి క్షేత్రవాస్తవ్యులు, గురువర్యులు, శ్రీవైష్ణవసింహ, ఉ. వే. శ్రీమాన్ టి. ఏ. కృష్ణమాచార్యస్వామివారు, ఉభయవేదాంత వాచస్పతి, నరసాపురం వాస్తవ్యులు, ఉ. వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారు, తిరుపతి వాస్తవ్యులు, పండితరాజ, వాచస్పతి, ఉ. వే. శ్రీమాన్ ఎస్. ఎన్. సి నరసింహాచార్యస్వామివారు, మొదలైన పలువురి పెద్దల మంగళాశాసనాలకు లక్ష్యమైనది. ఇప్పుడు, మళ్ళీ, సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి సభ్యుల ఆదరాభిమానాలను నోచుకుంటున్నది. ఇది చాలా సంతోషకరంగా ఉన్నది. భగవత్భాగవతాచార్య ప్రీతిని కలిగించేదే కదా ప్రాప్యం.

అత్యంతగంభీరమైన శ్రీపరాశరభట్టర్ వారి సూక్తిని వివరించాలని, అన్ని విధాలుగాను పరిమిత శక్తిని కల నేను, చేసే ఈ ప్రయత్నం, నాశక్తికి పూర్తిగా మించినదే అయినా, కాంచీ మహావిద్వాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారివంటి పెద్దలు ఇంతకు ముందు చూపించిన మార్గం ఒకటి ఉన్నందువల్ల, , దానిని అనుసరిస్తూ యథాశక్తి భగవద్భాగవతాచార్యసేవను చేయాలనే నా ఆశయే ఈ వ్యాఖ్యానానికి

మూలకారణం. విజ్ఞులైన పెద్దలు ఈ వరివస్యను ఆ దృష్టిలో వాత్సల్యంతో కటాక్షించగలరని నమ్ముతున్నాను.

ఇప్పుడు, మళ్లీ రెండవ మారు ముద్రింపబడుతున్న ఈ వ్యాఖ్యానంలో, కొత్త విషయాలు పెద్దగా ఏమీ లేనప్పటికీ, ఇంతకు ముందు ముద్రింపబడిన గ్రంథంలో అనువదింపబడని ప్రమాణవాక్యాలకు అన్నిటికీ అనువాదం చేర్చబడింది. ఇది పాఠకుల అవగాహనకు తోడుపడుతుందని నమ్ముతున్నాను. ఈ వ్యాఖ్యను మళ్లీ ముద్రించడానికి అనుకూలంగా సిద్ధం చేసిన సహృదయులు, వర్ధిష్ణువు, చిరంజీవి. శ్రీమాన్ వి. కేశవ అయ్యంగారికి అనేక కృతజ్ఞతాపూర్వక మంగళాశాసనాలు. స్వస్తి

**యద్యేతన్మమ కైంకర్యం ప్రీతయే శ్రీశసేవినామ్,**
**తదైవ సఫలం మన్యే సఫలం జననం చ మే.**

**"సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిత్ దుఃఖభాగ్భవేత్"**

**భాగవత విధేయుడు,**

**ఈ. ఏ. శింగరాచార్యులు.**



శ్రీమతే రామానుజాయ నమః

## ఆచార్యాభిమానికులం

వేదాదిశాస్త్రాలు భగవంతుని పొందడానికి కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులు అనే పలు విధాలయిన ఉపాయాలను తెలిపినప్పటికీ, వాటికంటే విలక్షణమైన సులభతమమైన మోక్షోపాయం ఆచార్యాభిమానమని తెలియజేసింది.

"పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్, ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్".

అని అంటూ, పాపాలనే చేసిన క్షత్ర బంధువు, పుణ్యాలను చేసిన పుండరీకుడు, అనే ఈ ఇద్దరు కూడా ఆచార్య సంబంధం వల్లనే ముక్తిని పొందారు, కనుక, ఆచార్యుని కలిగినవాడు కావాలి, అప్పుడే మోక్ష ప్రాప్తి కలుగుతుంది –అని స్పష్టంగా ఆచార్యాభిమానం అనే ఐదవ ఉపాయమే. ఉత్తమమైన ఉపాయం అని స్పష్టం చేసింది. శ్వేతాశ్వతరోపనిషత్తు కూడా చివరిలో,

**"యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ,**
**తస్యైతే కథితా హ్యర్థా ప్రకాశంతే మహాత్మనః"**

అని ఆచార్య భక్తి కలిగినవానికి సమస్త శాస్త్రార్థాలు కరతలామలకాలు అవుతాయి అని అన్నది. ఈ అర్థాన్నే వేదానికి ప్రతిరూపమైన శ్రీరామాయణం, పంచమ వేదమైన మహాభారతం, వేదోపబృంహణాలైన భాగవతాది పురాణాలు, దివ్య సూరుల దివ్య ప్రబంధాలు, పూర్వాచార్యుల రహస్య గ్రంథాలు మనకు ఉపదేశిస్తున్నాయి.

ఇంతగా ఎన్ని గ్రంథాలు ఉపదేశిస్తున్నప్పటికీ, ఆచార్యాభిమానం అని చెప్పబడే ఈ ఉత్తమమైన ఉపాయంలో నిష్ఠను కలిగి ఉండడం అనేది చాలా

అరుదైన విషయం. ఎంతో మహావిశ్వాసం ఉంటే తప్ప ఇది నిలకడగా నిలవదు. భగవంతుని విషయంలో భక్తి గానీ, భయం కానీ కలుగవచ్చు. కానీ, మనవలెనే ఈ లోకంలో సంచరిస్తూ, అన్నపానాదులను స్వీకరిస్తూ, జీవనాన్ని సాగించే ఆచార్యుల విషయంలో భక్తి విశ్వాసాలు కలగడం, కలిగినా, అది స్థిరంగా, బలంగా నిలువడం అనేది చాలా అరుదైన విషయం. అటువంటి విశ్వాసం చాలా కొద్దిమందిలోనే మనకు గోచరిస్తుంది. అటువంటి అదృష్టశాలులలో శ్రీమాన్ రుద్రరాజు నరసింహారాజు గారు ఒకరు.

అంతర్వేదిపాలెం నివాసి అయిన వీరు జన్మతః క్షత్రియకులానికి చెందినవారు. అయినా, కులశేఖరుల వలె, సాటిలేని ఆచార్య భక్తిని కలిగినవారు. వీరు మా పితామహపాదులు మహావిద్వాన్ ఉ. వే శ్రీమాన్. శేషశింగరాచార్య స్వామివారి శ్రీవాద సంబంధాన్ని పొందిన అదృష్టవంతులు. వారి విషయంలో గొప్ప భక్తి విశ్వాసాలను కలిగినవారు.

మా పితామహుల విషయంలో వారికి దైవ ప్రతిపత్తి ఉండేది. మా తాతగారి మాట అంటే వారికి వేదవాక్కే. అందరికీ నరసింహారాజుగారి మాట అంటే భయం, కానీ, నరసింహారాజుగారికి మా తాత గారి మాట అంటే ఎనలేని భక్తి. వారు మా తాతగారితో కలసి పలుమార్లు దివ్య దేశయాత్రలను చేశారు. వారితో కలిగిన సంబంధం కారణంగా కాంచీ మహావిద్వాన్ అణ్ణంగరాచార్యస్వామివారి వంటి మహనీయుల అనుగ్రహాన్ని పొందగలిగారు. పలుచోట్ల పలు విధాలుగా భగవద్భాగవతాచార్యకైంకర్యాలను చేసుకున్న మహనీయులు వీరు.

మన సంప్రదాయంలో స్వగత స్వీకారం, పరగత స్వీకారం – అని రెండు మోక్షోపాయాలు చెప్పబడుతున్నాయి. వీటిలో, స్వగత స్వీకారం

అంటే, చేతనుడు భగవంతుని సన్నిధిలో తన రక్షణభారాన్ని సమర్పించి, ఆ స్వామిని ఉపాయంగా స్వీకరించడం. పరగత స్వీకారం అంటే, భగవానుడే స్వయంగా చేతనుని రక్ష్యవస్తువుగా స్వీకరించడం. ఈ రెండిటిలో, పరగత స్వీకారమే ప్రధానమైనది అని " యమేవైష వృణుతే తేన లభ్యః" అని మొదలైన శ్రుతి వాక్యాలు తెలుపుతున్నవి. ఈ అర్థాన్నే ఉపబృంహణాలూ, ఆళ్వారుల సూక్తులు, ఆచార్యుల సూక్తులు వివరిస్తున్నాయి.

ఈ స్వగత స్వీకారం, పరగత స్వీకారం అనేవి ఆచార్యాభిమానమనే ఉపాయంలో కూడా ఉన్నాయి. ఆచార్యుని మోక్షోపాయంగా మనము అభిమానించడం స్వగత స్వీకారం. ఇది అప్రధానం. ఆచార్యుడు మనలను రక్ష్యవస్తువుగా అభిమానించడం, తనకు కావలసినవానినిగా అభిమానించడం పరగత స్వీకారం. తరించడానికి ఇదే ముఖ్యం. ఇదే తరించడానికి ప్రధానమైన ఉపాయం.

ఇటువంటి ఆచార్యాభిమానాన్ని నోచుకున్నవారు శ్రీమాన్ రుద్రరాజు నరసింహరాజుగారు. శ్రీనరసింహరాజుగారు అంటే, మా తాత గారికి, నాయనగారికి ఎనలేని అభిమానం. పుత్ర సమానమైన ప్రీతిని వారి విషయంలో మా తాతగారు కలిగి ఉండేవారు. ఈ అభిమానమే శ్రీమాన్ నరసింహారాజు గారు తరించడానికి కారణమైనది.

నేను తిరుపతిలో ఉద్యోగరీత్యా నివాసం ఉన్న కాలంలో, వీరు ఎప్పుడు తిరుపతికి వచ్చినా, మా ఇంటిలోనే బస చేసేవారు. శ్రీమాన్ తాత గారి విషయంలో, శ్రీమాన్ నాయన గారి విషయంలో ఎంతటి భక్తి విశ్వాసాలను కలిగి ఉండేవారో, నా విషయంలో కూడా అంతటి ప్రీతిని కలిగి ఉండేవారు.

ఒక విధంగా, నాకు తిరుపతిలో ఉద్యోగం లభించడానికి పరోక్షంగా వారు కారణమయ్యారు కూడా.

భగవత్ కటాక్షం తరతరాల వరకు వ్యాపించేటట్లుగా, భాగవత కటాక్షం, ఆచార్య కటాక్షం కూడా తరతరాల వరకు ప్రసరిస్తుంది కదా.

శ్రీమాన్ రుద్రరాజు నరసింహారాజుగారి ప్రభావంవల్ల వారి కుమార్తెలు, కుమార్తెల కుటుంబ సభ్యులు అందరూ కూడా భగవద్రామానుజ సంప్రదాయంలో భక్తి విశ్వాసాలను కలిగినవారు అయ్యారు. ఈ కుటుంబాలకు సంబంధించిన పలువురు శ్రీమాన్ తాతగారి వద్ద, దాసుని తండ్రిగారైన శ్రీమాన్ రంగాచార్య స్వామివారి వద్ద పంచసంస్కారాలను పొందగలిగారు.

ఆ విధంగానే శ్రీమాన్ తాతగారి, శ్రీమాన్ నాయనగారి కటాక్షం శ్రీమతి లక్ష్మీయతిరాజ వల్లిగారి పైన పడింది. వీరు శ్రీమాన్ నరసింహారాజు గారి మనమరాలైన రుక్మిణిగారి కుమార్తె. తల్లిగారి వలె, వీరు కూడా, శ్రీరామానుజ సంప్రదాయంలో గాఢమైన భక్తి విశ్వాసాలను కలవారు. ఆచార్య భక్తిని కలిగినవారు. సాధ్యమైనంతలో భగవద్భాగవతాచార్య కైంకర్యాలను చేసుకోవాలనే ఆసక్తిని, ఆతురతను కలిగినవారు. ఆ ఆసక్తియే ప్రస్తుతం వీరు శ్రీరంగ రాజస్తవం పూర్వ శతక గ్రంథ పునర్ముద్రణ చేయించడానికి కారణమైనది.

వీరు, శ్రీమతి జానకమ్మగారి సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి సభ్యురాలు. ప్రతి దినం వారు ఆన్ లైన్లో చేసే ప్రవచనాలను విని, తమకు కల సంప్రదాయ సాహిత్యాభిరుచిని పెంపొందించుకున్నారు. దాని ఫలితమే ప్రస్తుత గ్రంథముద్రణం.

శ్రీమతి యతిరాజవల్లి గారు శ్రీమాన్ పితామహపాదులు అన్నా, శ్రీమాన్ మా నాయన గారు అన్నా, చాలా భక్తి విశ్వాసాలు కలవారు వారి విషయంలో ఏదైనా ఒక మంచి కైంకర్యాన్ని చేసుకోవాలి – అనే ఆశ వీరికి చాలా కాలంగా ఉన్నది. ఆ ఆశ ఇప్పుడు ఈ గ్రంథముద్రణ ద్వారా సఫలం కాబోతున్నది. వీరిని నేను మనసారా అభినందిస్తూ, మంగళాశాసనాలను చేస్తున్నాను.

వీరు చేసే ఈ భగవద్భాగవతాచార్యకైంకర్యం అందరి మెప్పును పొందాలని, శ్రీ రంగనాయకీ శ్రీరంగనాథుల దివ్యానుగ్రహం, పెద్దల మంగళాశాసనాలు వీరికి పరిపూర్ణంగా లభించాలని మనసారా కోరుకుంటున్నాను. ఈ విధంగానే వీరు భవిష్యత్తులో మరిన్ని మంచి మంచి సాంప్రదాయికమైన కైంకర్యాలను చేసికొనగలిగే సదవకాశం వీరికి కలగాలని, ఆ విధంగా వీరిని అనుగ్రహించవలసినదిగా అస్మదారాధ్య దైవమైన పద్మావతీ సమేత శ్రీనివాస భగవానుని, పెద్దలను ప్రార్థిస్తూ, స్వస్తి.

భాగవత దాసుడు

ఈ. ఏ. శింగరాచార్యులు



**జైశ్రీమన్నారాయణ**
**అస్మద్గురుభ్యో నమః**
**శ్రీమతే రామానుజాయ నమః**

# ద్వయామోదము

శ్రీమన్నారాయణుడు స్తవప్రియుడు. ఆ స్వామి వైభవకీర్తనమే స్తుతి. నమస్కృతి వలె స్తుతి కూడ త్రికరణాత్మకము. అతి ప్రాచీనమైన ప్రక్రియ. వైదికము. ఉపబృంహణములలో కూడ ఈ ప్రక్రియ కనిపిస్తుంది. విభిన్నసంప్రదాయములలో వాటికి అనుగుణముగ స్తుతిసాహిత్యము విస్తరిల్లినది. శ్రీసంప్రదాయమున పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రవాఙ్మయము విశేషాదరమును పొందినది. ఆళ్వారుల పరంపరలో కులశేఖరులు సంస్కృతభాషలో అనుగ్రహించిన ముకుందమాల అనే స్తోత్రముమొదటిది అని పెద్దల నిర్ణయము. ఆచార్యపరంపరలో శ్రీమద్యామునులు రెండు స్తోత్రములు అనుగ్రహించినారు. కాన్తస్తే పురుషోత్తమః. . . . . అనే ప్రారంభశ్లోకముతో ఆ స్తోత్రము కాన్తాచతుశ్శ్లోకి గా ప్రసిద్ధము. మరొకటి స్తోత్రరత్నమని ప్రసిద్ధము. సర్వోత్తమముగ రత్నత్రయిలో ఒకటిగ గణింపబడినది. భగవద్రామానుజుల గద్యత్రయము, కూరేశుల పంచస్తవి వాటికి అవే సాటిగ వన్నెకెక్కినవి.

కూరేశుల కుమారులు శ్రీపరాశరభట్టరులు. శ్రీరంగేశుని ప్రసాదము వలన కూరేశుల వంశము అంకురించినది. కవలలు కలిగినారు. పసిపిల్లలను ఆశీర్వదించాలని రామానుజులు విచ్చేసినారు. పిల్లలు ద్వయామోదమును కలిగియున్నారు. వారు ఆఘ్రాణించి ఆనందించినారు. నామకరణము కావించి తమ పాదచ్ఛాయ వంటి గోవింద భట్టరువారినే శిశువులకు ఆచార్యులుగ నిశ్చయించినారు. దివ్యదంపతులు శ్రీరంగనాయకీ

నాయకులకు అప్పగించినారు. పిల్లలు పెద్దలయి కన్నవారికీ పెంచినవారికీ వారసులయి తమ నామములు సార్థకములు కావించుకొనినారు. వారిలో పెరియభట్టరుగ ప్రసిద్ధులయిన పరాశరభట్టరువారు అత్యద్భుతమయిన స్తోత్రములను అనుగ్రహించినారు. పసిప్రాయమున రక్ష పెట్టిన ద్వయామోదము ప్రౌఢవయస్సున శ్రీరంగరాజస్తవద్వయముగ పరిమళించినది. మంత్రరత్నము వన్నెతో పాటుగ సువాసనావాసితమయినది. స్తుతివాఙ్మయసీమంతినీ తిలకముగ తీర్చిదిద్దబడినది. సురభిళ సుమమాలికాద్వయమై గళసీమను అలంకరించినది. ద్వయమంత్రార్థ సౌరభములను వెదజల్లినది. వేయిపడగలు గల అనంతుడు వెలిగ్రక్కిన చింతామణి కాంతులీనుతూ కనవచ్చినది. ద్వయమంత్ర పూర్వోత్తరఖండార్థ వివరణములుగ పూర్వోత్తరశతకద్వయము పూర్వాచార్యులప్రస్తుతికి ప్రస్తావమయినది. శ్రీరంగనాథునివైభవ ప్రతిపాదకములయిన స్తుతులలో అగ్రగణ్యమయినది.

శ్రీరంగరాజస్తవ పూర్వోత్తరశతకములకు మహనీయులయిన విద్వాంసులు సంస్కృతమున, మణిప్రవాళమున వ్యాఖ్యానములను అనుగ్రహించినారు. వాటిని అన్నింటినీ పరిశీలించి సమన్వయించి శ్రీరంగరాజస్తవము-పూర్వశతకమునకు వరివస్య అను పేరుతో సమగ్రమయిన ఆంధ్రవ్యాఖ్యానమును అనుగ్రహించి పండితరత్న ఉ. వే. శ్రీమాన్ డా. ఈ. ఏ. శింగరాచార్యస్వామివారు పాతిక సంవత్సరముల క్రిందట 1999వ సంవత్సరమున ప్రకటించినారు. ఈ దాసురాలు నరసాపురమున ప్రథమముగ వారిని సేవించినప్పుడు (24-09-2000) ఒక ప్రతిని మంగళాశాసనములతో అనుగ్రహించినారు. ప్రస్తుతము ప్రతులు

లభ్యమగుటలేదు. సుమారు 15సం॥ల క్రితమే ఈ గ్రంథపునర్ముద్రణ కైంకర్యమును ఆశించినా ఫలించలేదు. వరదుని అనుగ్రహము వలన ఆ కైంకర్యాభిలాష నేటికి కార్యరూపము దాల్చినది.

శ్రీరంగనాథుడు సదుపాయజ్ఞుడు. అరయర్ గానముతో వరదుని మెప్పించి రామానుజులను తన వద్దకు రప్పించుకొన్న చతురుడు. అటువంటి చమత్కారమే ఇది. వరదుని సన్నిధిలోనే భాగవతముఖమున ఈ కైంకర్యసూచన చేయించినాడు. మా సద్గ్రంథాధ్యయన సంగోష్ఠికి సదవకాశము కలుగజేసినాడు. గోష్ఠి అందరము పంచస్తవార్థాధ్యయనము పరిపూర్ణము చేసుకొని ఆచార్యవరివస్య, గోష్ఠి తృతీయ వార్షికోత్సవము కాంచీపురమున(పెరుమాళ్ కోయిల్) 2024 జూలై 18, 19, 20 తేదీలలో నిర్వహించుకొన్నాము. శ్రీరంగరాజ స్తవార్థానుసంధానము ఆరంభించుకున్నాము. ఆ సందర్భమున శ్రీరంగనాథుని సంకల్పము వరదుని అనుగ్రహము శ్రీమాన్ శింగరాచార్యస్వామివారి సూచనగ మా గోష్ఠి సభ్యురాలు శ్రీమతి లక్ష్మీ యతిరాజవల్లికి గ్రంథముద్రణ కైంకర్యరూపమున లభించినది. అనూహ్యమయిన ఈ భాగ్యమును ఆమె ఆనందముగ స్వీకరించేరు.

శ్రీమతి లక్ష్మీయతిరాజవల్లి కుటుంబమునకు చెందిన పెద్దలు మహా విద్వాన్ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి అంతరంగ శిష్యులు. వారి సంస్కారము పరంపరగ తమ తల్లిగారి వలన యతిరాజవల్లికి కలిగినది. న్యాయవేదాంత విద్వాన్ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు ఈకు నామకరణం చేసినారట. వీరి కుటుంబము పట్ల ఆచార్యులకు అంతులేని వాత్సల్యము. ఆచార్యాభిమానము చూరగొనిన

వీరు రంగాచార్యస్వామివారి దివ్యస్మృతిగ ఏదయినా సద్గ్రంథమును ప్రకటించుకోవాలని చాలా కాలముగ వేచియున్నారు. వారి ఆచార్యకైంకర్యాభిలాష ఈనాటికి సఫలమయినది. శ్రీరంగరాజస్తవము రంగాచార్యస్వామి దివ్యస్మృతి కైంకర్యముగ ఆవిష్కృతమవుతున్నది. శుభస్య శీఘ్రమ్ అని భావించి పెద్దలు సూచించిన వెంటనే తమ సంసిద్ధతను వ్యక్తపరిచినారు. ఈ కైంకర్యమున ఆమెకు గల ఆదరము ప్రస్ఫుటమయినది. ఆచార్య సేవానిరతి, సద్గ్రంథాధ్యయనాసక్తి గల యతిరాజవల్లి మా గోష్ఠి సభ్యురాలు కావడము ఆనందావహము. తమ కుటుంబమున పెద్దలకు ప్రేయోదాయకములు, తమకు, తమ సంతానమునకు శ్రేయోదాయకములు అగు సత్కైంకర్యశ్రీమంతులుగ ఆ దంపతులు సదా విలసిల్లాలని మంగళాశాసనము చేస్తున్నాను.

మా సద్గ్రంథాధ్యయన సంగోష్ఠికి మూడు సంవత్సరములు నిండినవి. గద్యత్రయము, పంచస్తవి, నిత్యానుసంధానము, గోపాలవింశతి వంటి సద్గ్రంథాధ్యయనముతో పాటుగ ఆరు సద్గ్రంథములను ప్రకటించుకొనే అదృష్టము కలిగినది. ముందుగ సుందరుని దర్శించినాము. 1. సుదరదర్శనమ్. తరువాత వైకుంఠుని స్తుతించినాము. 2. శ్రీవైకుంఠస్తవము. మధ్యలో గోపాలుని సేవించి 3. గోపాలవింశతి. ఆలకాపుని పలకరించేము. 4. ఆలకాపు కథలు. తదుపరి వరదుని సన్నిధినిచేరుకున్నాము 5. వరదరాజస్తవము. (అసంపూర్ణము). కూరేశులను సేవించి పంచస్తవి విన్నవించినాము. 6. పంచస్తవి.

ఈ విధముగ మూడు పువ్వులు, ఆరు కాయలు అనే నానుడి మూడు సంవత్సరములు. ఆరు సద్గ్రంథములుగ మా గోష్ఠికి సమన్వయిస్తున్నది. ఈ

సందర్భమున మా గోష్ఠికి ఆచార్యులుగ తమ మంగళాశాసనములను అందిస్తూ మమ్ములను సదా ప్రోత్సహిస్తున్న ఆశ్రితవాత్సల్యైకజలధి పరమహంస పరివ్రాజకులు శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయరుస్వామివారికి దాసోహములు సమర్పిస్తున్నాను. మూడు సంవత్సరములుగ మాప్రార్థన మన్నించి ఆత్మీయముగ గోష్ఠి వార్షికోత్సవము, ఆచార్యవరివస్య కార్యక్రమమున ప్రత్యక్షముగ అన్వయిస్తూ మంగళాశాసనములు అనుగ్రహిస్తున్న పరమహంస పరివ్రాజకులు శ్రీ శ్రీ శ్రీ త్రిదండి అహోబిల రామానుజజీయరు స్వామివారికి దాసోహములు సమర్పిస్తున్నాను. సహృదయ శిరోమణి, సద్గ్రంథ వ్యాఖ్యాత, పండితరత్న ఉ. వే. శ్రీమాన్ డా. ఈ. ఏ. శింగరాచార్యస్వామి మా గోష్ఠి పట్ల ఎనలేని వాత్సల్యముతో దిశానిర్దేశము చేస్తూ పెద్దదిక్కుగ మమ్ములను నడిపిస్తున్నారు. వారి సహకారము లేనిదే గ్రంథముద్రణరూప కైంకర్యము మాకు సాధ్యము కానేకాదు. శ్రమకోర్చి గ్రంధమును ముద్రణమునకు సిద్ధము చేసి మాకు అందజేస్తున్న వారి ఆదరమునకు కృతజ్ఞతాపూర్వక ముగ దాసోహములు సమర్పిస్తున్నాను. శ్రద్ధగ సద్గ్రంథాధ్యయనము చేస్తూ సత్కైంకర్యములకు ముందుండి ఒక కుటుంబముగ ఆత్మీయముగ అనువర్తిస్తున్న గోష్ఠిని మనసారా అభినందిస్తున్నాను.

సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి వర్థతామభివర్థతామ్

భాగవతవిధేయురాలు

కె. వి. జానకి,

బెంగుళూరు.



# ఆచార్యులకు వందనం

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీలక్ష్మీనరసింహస్వామినే నమః

**శ్రీమత్పద్మాసనస్థం శశి హిమధవళా శాంత మానందకందం**
**వామాంకారూఢ లక్ష్మీవరకుచయుగళ న్యస్తహస్తం ప్రశస్తమ్,**
**ఊర్ధ్వం శంఖం చ చక్రం దధత మఘహరం దక్షిణే సవ్యహస్తే**
**వందే లక్ష్మీనృసింహం పర మభయకరం వాసవాద్యాభివంద్యమ్.**

**ప్రహ్లాద వరదం విష్ణుం నృసింహ మపరాజితమ్,**
**శరణ్యం సర్వలోకానా మాపన్నార్తి నివారణమ్.**

మా ఆచార్యులు శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారికి ఆచార్యకైంకర్య రూపంగా శ్రీ పరాశరభట్టర్ వారు అందించిన శ్రీరంగరాజస్తవం తెలుగు వ్యాఖ్యానం ముద్రించుకునే అవకాశం మాకు లభించినందుకు చాలా సంతోషం కలిగింది. ఈ సదవకాశం మాకు ఇచ్చినందుకు విదుషీమణి శ్రీమతి జానకమ్మ గారికి, శ్రీమాన్ శింగరాచార్య స్వామివారికి అనేక అనేక దాసోహాలను సమర్పించుకుంటున్నాను. ఇది కూడా మా ఆచార్యుల అనుగ్రహమే.

మా అమ్మగారి తాతగారు రుద్రరాజు వెంకట నరసింహారాజు గారిద్వారా మేము ఈ సంప్రదాయంలోకి వచ్చాము. తాత గారికి శ్రీ రంగాచార్య స్వామి వారి తండ్రిగారు అయిన శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామి వారు గురువుగారు. వారిది చాలా సహృదయం, చాలా మెత్తని స్వభావం అని మా తాతగారి మాటలలో విన్నాము. మా తాత గారికి వారి మాట అంటే వేదవాక్కు. అమ్మమ్మ, అమ్మ అందరూ వారి శిష్యులే.

మా ఆచార్యులవారికి ఇటువంటి కైంకర్యం చేసుకోవాలని సంకల్పం ఉంది. కానీ, ఆచరణలోకి రావడానికి ఇప్పటికీ అవకాశం దొరికింది. శ్రీమతి జానకమ్మ గారి దయవల్ల శ్రీమాన్ శింగరాచార్య స్వామి వారి కృప కారణంగా, మా ఆచార్యుల వారి అనుగ్రహం వల్ల ఈ మహద్భాగ్యం లభించింది. శ్రీమాన్ కందాళ వేంకటాచార్య స్వామివారి ఆచార్య వరివస్య కాంచీపురంలో జరిగే సమయంలో, వారి కృప వల్ల, శ్రీమాన్ శింగరాచార్య స్వామివారు మాకు చెప్పడం, శ్రీమతి జానకమ్మ గారు సహృదయంతో అంగీకరించడం భాగ్యంగా భావిస్తున్నాము. అమ్మ చిరునవ్వు, స్వామి వారి దయ, మా ఆనందం, ఆ క్షణంలో నేను ఒక చిత్రకారిణి అయి ఉంటే బాగుండేది, ఆ సన్నివేశం చిత్రీకరించుకునేదాన్ని అనిపించింది మనసులో ఆ మధుర క్షణం ముద్రించుకు పోయింది.

విదుషీమణి జానకమ్మ గారు అనే వేంకటాచార్య స్వామి వారి చిలుక శ్రీమాన్ శింగరాచార్య స్వామి వారి తెలుగు వ్యాఖ్యానం అనే కొమ్మను ఆధారంగా చేసుకుని శ్రీరంగనాథుని గురించి "శ్రీ రంగా! శ్రీరంగా! "అంటూ ప్రవచనం చేస్తూ ఉంటే, ఆ ధ్వనితరంగాలలో మన మనసులు తేలియాడుతూ శ్రీరంగం దర్శించుకుందాం.

"రామానుజుల వారి గద్యత్రయం సేవించుకున్నాం, వారి శిష్యులైన కూరేశుల పంచస్తవాలు సేవించుకున్నాం, ఇప్పుడు వారి శిష్యుల శిష్యులైన భట్టరు వారి శ్రీరంగరాజస్తవం సేవించుకుందాం" అని అమ్మ ఆ వరుసక్రమం చెప్తుంటే, మాలాంటి వారికి చేయి పట్టి సంప్రదాయం వైపు నడిపించే గోదమ్మలా అనిపించేరు.

కంచి వరదరాజస్వామి సన్నిధిలో ఏదైనా మంచి అనుకుంటే, అది 100 రెట్లుగా అవుతుంది- అని అమ్మగారు వరదరాజస్తవం ప్రవచనం అని చెప్పే సమయంలో అన్నారు. ఇటువంటి గ్రంథ కైంకర్యం 100 రెట్లుగా లభించాలని పెద్దలందరి మంగళాశాసనం లభించాలని ఆచార్యులైన శ్రీమాన్

రంగాచార్యస్వామివారి, శ్రీమాన్ వేంకటాచార్య స్వామివారి పాదాలకు అంజలి చేసుకుంటున్నాను. "మన గ్రంథాలని మనమే పరిరక్షించుకోవాలి" అనే అమ్మవారి మాటలలో, బాటలలో పయనించాలని చిన్ని ఆశ.

విదుషీ మణి శ్రీమతి జానకమ్మగారి మొదటి పరిచయం మా అమ్మగారి(రుక్మిణి)మాటలలో విన్నాను. . వారు నరసాపురం బ్రహ్మోత్సవాలలో కృష్ణుడు గురించి ప్రవచనం చేసేటప్పుడు అందరూ మంత్రముగ్ధులయ్యారట. ఆ తన్మయత్వం మా అమ్మగారి మాటలలో విన్నాను. సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి ద్వారా పంచస్తవాలు నేర్చుకునే క్రమంలో అమ్మవారిని నేను ప్రత్యక్షంగా వినగలిగే, చూడగలిగే అదృష్టం లభించింది. వారి మాటలలో మాధుర్యం, అర్థ వివరణ చేసే సమయంలో వారి సునిశితత్వం, ఇంకా చెప్పాలి అనే వారి సహృదయం, వారితో మాట్లాడినప్పుడు వారిలోని ఆర్ద్రత చూశాను. కాలక్షేపం చేసే సమయంలో పదాల మీద పట్టు సాధించాలి అని మమ్మల్ని ప్రోత్సహించడం, ప్రమాణత్తిరట్టులను చెప్తూ, అన్ని గ్రంథాలని మా చేత సేవింప చేయడం, ఇలా ఎన్నో. అమ్మగారి ఆచార్య హృదయానికి, వారికి పాదాభివందనం చేస్తున్నాము, సద్గ్రంథాధ్యయన సంగోష్ఠి అందరం.

ఉ. వే శ్రీమాన్ డాక్టర్ శింగరాచార్య స్వామివారి గురించి మొదటగా మా అమ్మగారి, తాతగారి మాటలలో విన్నాను. మా తాత గారికి వారు అంటే ప్రత్యేక అభిమానం. చాలా గ్రంథాలు రాశారు అని చెప్పేవారు. కరోనా సమయంలో ధనుర్మాసంలో సతీష్ గారి ప్రవచనం డాట్ కామ్ ద్వారా వారి ప్రవచనం వినే భాగ్యం కలిగింది. అందరం పరిచయం చేసుకుంటుంటే, సతీష్ గారితో "నాకు తెలుసు మా ఊరి అమ్మాయి" అని చెప్తుంటే చాలా సంతోషం కలిగింది. ఆచార్యులవారిని కలవడానికి వెళ్లినప్పుడు, స్వామివారు రచించిన కోశాలు ఇచ్చి చదువుకోమని చెప్పేవారు.

అంతర్వేదిపాలెంలో ధనుర్మాసంలో మా తాతగారితో కూడా అప్పుడప్పుడు మా వైష్ణవుల ఇంటికి వెళ్లేవాళ్ళం. అక్కడ ఆనెల రోజులు పండగలా ఉండేది. మా గురించి మా తాతగారి మాటలలో విన్నాను. మా ఆచార్యులు వారికి మేము అంటే ప్రత్యేక అభిమానం అని అక్కడ భాగవతుల మాటలలో తెలిసింది. ఆ అభిమానం ఎంత అంటే, మాకు చిన్న ఇబ్బంది కలిగినా, వారి కళ్ళల్లో నీరు వచ్చే అంతటి అభిమానం. అమ్మగారి ఇంటికి వెళ్లినప్పుడల్లా స్వామి వారిని సేవించుకునే వాళ్ళం. ఎక్కువ రోజులు కలవకపోయినా, ఫోన్ చేయకపోయినా, "ఎందుకు ఫోన్ చేయలేదు? ఎలా ఉన్నారు?" అని అందరిని అక్కడ ఉండే వారిని అడిగేవారట. అంత ప్రత్యేకమైన అభిమానం.

## మా కుటుంబం గురించి చిన్న పరిచయం

సహనానికి మారుపేరైన అమ్మగారు శ్రీమతి రుక్మిణి ఎదుటి మనిషికి సాయం చేయాలనే నాన్నగారు రుద్రరాజు వెంకట లక్ష్మి నరసింహ రాజు. అన్నింటా నాకు చేయూతనందించే మావారు పేరిచర్ల కృష్ణమూర్తి రాజు, మా అబ్బాయిలు శ్రీకృష్ణ రోహిత్ వర్మ, శ్రీరంగ నిఖిల్ వర్మ, మా చెల్లెలు శ్రీమతి కృష్ణవేణి, కోసూరి సంపత్ కుమార్, కూతుళ్లు శ్రీశ్రియ, సుస్నిగ్ధ, మా పెద్ద తమ్ముడు రుద్రరాజు వెంకటపతి రాజు, భార్య అరుణ జ్యోతి, పిల్లలు సాత్విక్ వర్మ, గోదా శ్రీనిత్య, మా చిన్న తమ్ముడు వెంకట సత్యనారాయణ రాజు, భార్య దీప్తి. కుమారులు నిహంత్ వర్మ, సాహిత్ వర్మ.

అందరం కలిసి ఒకే మాటగా ఉండాలని మా నాన్నగారి కోరిక. ఈ సంప్రదాయంలోనే కొనసాగాలని అమ్మగారి కోరిక. వారి ఆశయం సిద్ధించాలని పెద్దలందరూ మంగళాశాసనాలు అందించాలని ఆశిస్తున్నాము. శ్రీమాన్ పరాశర భట్టరు వారు అందించిన శ్రీరంగరాజస్తవం అనే గ్రంథంలో అమ్మ వైభవం, పెరుమాళ్ళ వైభవం ప్రకటితమవుతోంది అని, కావేరీ నది

మొదలు శ్రీరంగనాథుని మూలవిరాట్ పాదాల వరకు వర్ణిస్తూ ఆశువుగా చెప్పిన మొదటి గ్రంథం అని అమ్మగారు తెలియజేశారు. 108 దేశాలలో మొట్టమొదటి దివ్యదేశ అర్చా మూర్తి అయిన శ్రీ రంగనాథుని కళ్యాణ గుణాల వర్ణనలో మన మనసులు ఆనందంలో నిండిపోవాలని ఆశిస్తున్నాను. ఇటువంటి భాగ్యం కలిగించిన శ్రీమతి జానకమ్మగారికి, వ్యాఖ్యానం అందించిన శ్రీమాన్ శింగరాచార్యాచార్య స్వామివారికి, మా ఆచార్యులవారికి కృతజ్ఞతతో దాసోహాలు సమర్పించుకుంటున్నాను. భాగవతుల మంగళాశాసనాలు ఎల్లప్పుడు మా కుటుంబాలకి అందించాలని, ఇటువంటి ఎన్నో కైంకర్యాలు ముందు ముందు చేసుకునే భాగ్యం కలగాలని ఆచార్య భాగవత మంగళా శాసనాలు చేయమని ప్రార్థిస్తున్నాను.

అడియేన్

భాగవతదాసురాలు

పేరిచర్ల లక్ష్మీ యతిరాజ వల్లి రామానుజ దాసి.



# 1. భారద్వాజగోత్రవైభవం

భరద్వాజగోత్రం భరద్వాజమహర్షిని కూటస్థునిగా కల్గినది. మంత్రద్రష్టలైన మహర్షులు పలువురిలో సప్తర్షులుగా ప్రసిద్ధిచెందిన ఏడుగురు మహర్షులు ముఖ్యులు. ఈ సప్తర్షుల వివరం ఆయా మన్వంత రాలను బట్టి వేర్వేరుగా ఉన్నది. ఈ వైవస్వతమన్వంతరంలో సప్తర్షులుగా పరిగణింపబడేవారు – వశిష్ఠ, అత్రి, గౌతమ, కశ్యప, భరద్వాజ, జమదగ్ని, విశ్వామిత్రులు. అందువల్ల ప్రస్తుత వైనస్వత మన్వంతరానికి చెందిన సప్తర్షులలో భరద్వాజ మహర్షి ఒకరు.

ఈ భారద్వాజ మహర్షి దర్శించిన సూక్తాలు ఋగ్వేదంలో, యజుర్వేదంలో, సామవేదంలో కూడా కన్పిస్తాయి. తైత్తిరీయ యజుర్బ్రాహ్మణంలోని కారకమనే భాగంలో గల మొదటి ప్రశ్నలో "**భరద్వాజో హ త్రిభి రాయుర్భిః బ్రహ్మచర్య మువాస**" అని ఆరంభమయ్యే భాగంలో భరద్వాజ మహర్షికి చెందిన ఒక ఉపాఖ్యానం కన్పిస్తుంది. వేదాలను అన్నిటిని సమగ్రంగా అధ్యయనం చేయగోరిన భరద్వాజ మహర్షి ఇంద్రుని ఉపాసించి, మూడవందల సంవత్సరాల పరిమితిని కల ఆయుస్సును పొందారు. ఆ ఆయుష్కాలం అంతా వేదాధ్యయనాన్ని చేశారు. అయినా వేదాధ్యయనం పూర్తికాలేదు. ఆయుష్కాలం పూర్తి కాగానే ఇంద్రుడు ప్రత్యక్షమై, "భరద్వాజ మహర్షీ! మళ్ళీ మీకు నూరేండ్లు ఆయుస్సును ఇస్తే ఏంచేస్తారు?" అని అడిగాడు. ఆ కాలంలో కూడా అధ్యయనం చేస్తానని మహర్షి అన్నారు. అపుడు ఇంద్రుడు – ఈ మహర్షి వేదాలను అన్నిటిని పూర్తిగా అధ్యయనం చేయిగోరుతున్నట్లున్నాను. ఇది సాధ్యం కాదని వీరికి తెలియజేయాలి. అని భావించి తన యోగమహిమతో మూడు వేదాలను మూడు పర్వతాలుగా చేసి, ఆ మహర్షికి చూపి, ఆ పర్వతాలు ఒక్కొక్కటి నుండి ఒక్కొక్క పిడికెడు ధూళిని తీసి, "ఓ మునీ! మీరింతవరకూ అధ్యయనం చేసిన వేదాల పరిమితి ఏతావన్మాత్రం. ఇక చేయవలసిన భాగం ఎదురుగా కన్పించే పర్వతాల పరిమాణంలో ఉన్నది. అందువల్ల వేదాలు అనంతాలు సుమా!" అని అన్నాడు. వేదాధ్యయనాన్ని పూర్తిగా చేయలేక పోయానని చింతిల్లే భరద్వాజ మహర్షికి ఇంద్రుడు "**ఏహీమం విద్ధి అయం వై**

**సర్వవిద్యేతి. తస్మై హైతమగ్నిం సావిత్రమువాచ**" అని సర్వవిద్యాసారమైన సావిత్రవిద్య నుపదేశించి, అతని ఆర్తిని తీర్చాడు. (ఈ సావిత్రవిద తిరువాయ్మొరి ప్రబంధమే అని పెద్దల అభిప్రాయం).

భరద్వాజనామానికి "**భరే దేవాన్ భరే విప్రాన్ భరే శిష్యాన్ గురూనపి, భరే భార్యాం చ పుత్రాంశ్చ భరద్వాజోస్తు సో మునిః**" అనే వ్యుత్పత్తి చెప్పబడుతున్నది. దేవతలను, బ్రాహ్మణోత్తములను, శిష్యులను, గురువులను, భార్యను, పుత్రులను భరించేవాడు (పోషించేవాడు) కనుక భరద్వాజుడనే పేరు వచ్చిందని దీని భావం, ఈ వ్యుత్పత్తిద్వారా ఈ మహర్షికి గల అనితరసాధారణవైభవం విశదం అవుతున్నది.

తమ యోగమహిమతో చిరకాలం జీవించే వశిష్ఠ విశ్వామిత్ర జమదగ్న్యాది మహర్షులలో భరద్వాజ మహర్షికూడా ఒకరు. ఈ మహర్షిప్రస్తావన కృతయుగంలోనేకాక, త్రేతాయుగంలో కూడా గోచరిస్తుంది. వాల్మీకి మహర్షి ప్రణీతమైన శ్రీరామాయణంలో భరద్వాజ మహర్షి ప్రస్తావన అయిదుచోట్ల కన్పిస్తుంది. సంక్షేపరామాయణంలోని 31వ శ్లోకంలో "**చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్**" అని, అందు లోనే 87వ శ్లోకంలో "**భరద్వాజాశ్రమం గత్వా రామ స్సత్య పరాక్రమః, భరతస్యాంతికం రామో హనూమంతం వ్యసర్జయత్**" అని, అయోధ్యాకాండలో శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కలసి భరద్వాజాశ్రమాన్ని చేరిన సందర్భాన్ని తెలిపే 54వ సర్గలో, ఆ కాండలోనే 90వ సర్గలో భరతుడు భరద్వాజాశ్రమాన్ని చేరిన సందర్భంలో, చివరిగా యుద్ధకాండలో పుష్పకవిమానంలో శ్రీరాముడు సపరివారంగా అయోధ్యకు తిరిగి వస్తూ మధ్యలో భరద్వాజాశ్రమాన్ని చేరిన సందర్భాన్ని తెలిపే 127వ సర్గలో ఈవిధంగా అయిదుమార్లు భరద్వాజ ప్రస్తావన ఉన్నది (బాలకాండలోని 2వ సర్గలో కన్పించే వాల్మీకి మహర్షి శిష్యుడైన భరద్వాజుడు ఈ భరద్వాజమహర్షికంటే భిన్నుడని గుర్తించాలి).

శ్రీరామునకు భరద్వాజమహర్షిపై గల గౌరవం, భక్తి "**భరద్వాజస్య శాసనాత్**" ఇత్యాది ప్రయోగాల వల్ల తెలుస్తున్నది. ఇక ఈ మహర్షికి శ్రీరాముని

విషయంలో గల అస్థానే భయశంకారూపమైన ప్రీత్యతిశయం ఎటువంటిదో భరతుని చూచి **"కచ్చిన్న దుష్టో వ్రజసి రామస్యాక్లిష్టకర్మణః, ఇయం తే మహతీ సేనా శంకాం జనయతీవ మే"** అని ప్రశ్నించడం ద్వారా వ్యక్తమవుతున్నది. దీనినిబట్టి ఈ మహర్షికి భగవదవతార రూపుడైన శ్రీరాముని విషయంలోగల ప్రీతి, మంగళాశాసన పర్యవసాయి అయిన ఆ దివ్యసూరుల ప్రీతివంటిదని వ్యక్తమవుతున్నది.

ప్రధానగోత్ర ప్రవర్తకులలో భరద్వాజమహర్షి ఒకరు. **"జమదగ్నిః భరద్వాజో విశ్వామిత్రాత్రిగౌతమః, వశిష్ఠకాశ్యపాగస్త్యా మునయో గోత్రకారిణః"** అనే మనువచనం దీనిని తెల్పుతున్నది. భరద్వాజ గోత్రులు మూడు వేదాలలోను కన్పడుతున్నారు. భరద్వాజుడు దర్శించిన సూక్తాలు మూడు వేదాలలోను కన్పిస్తున్నాయని పూర్వోక్తమే. ఈమహర్షి మూడువందల సంవత్సరాల కాలం వేదాధ్యయనాన్ని చేసినట్లు కారకంలోని ఉపాఖ్యానం తెల్పుతున్నందున ఒక్కొక్క వేదాన్ని నూఱు నూఱు సంవత్సరాల కాలంలో ఈ మహర్షి అధ్యయనం చేసి ఉండవచ్చు.

భరద్వాజ మహర్షి చెందిన మరొక విశేషం– అసాధారణమైన భాగవత తదీయారాధననిర్వహణం. ఇది మనకు వాల్మీకి రామాయణంలో కన్పడుతుంది. శ్రీరాముని అయోధ్యకు తిరిగి తీసికొని రావడంకోసం సపరివారంగా భరతుడు. రాముడుంటే చోటుకు ప్రయాణం చేస్తూ మధ్యలో భరద్వాజాశ్రమంలో విడిది చేశాడు. అపుడు భరద్వాజ మహర్షి భరతపరివారానికి చేసిన విందు ఎంత విలక్షణమైనదో **"నైవాయోధ్యం గమిష్యామో న గమిష్యామ దండకాన్, కుశలం భరతస్యాస్తు రామస్యాస్తు తథా సుఖమ్"** అనే విందును ఆరగించిన పరివారం పల్కిన వచనాలు స్పష్టం చేస్తున్నాయి. ఇదేవిధంగా శ్రీరాముడు రావణ వధానంతరం అయోధ్యకు తిరిగివస్తూ దారిలో భరద్వాజాశ్రమంలో నిలిచినపుడు శ్రీరామునితో పాటు వచ్చిన వానరసేన తృప్తిగా భుజించే రీతిలో అచటి ఉండే వృక్షాలు మధురఫలాలను ఇచ్చేటట్లు తపశ్శక్తి ద్వారా చేశాడు. ఇది భరద్వాజుని వేరొక విందు.

భరద్వాజమహర్షి తపస్సుద్వారా, నిరంతర వేదారధ్యయనం ద్వారా తమ సంపాదించిన విజ్ఞానాన్ని పలుగ్రంథాలరూపంలో లోకానికి అందించారు. భరద్వాజ శిక్షా, భరద్వాజ సంహిత, భరద్వాజ శ్రోతసూత్రం, భరద్వాజ స్మృతి – ఈవిధంగా పలు వైదికగ్రంథాలు ఈ మహర్షికర్తృకాలుగా కన్పిస్తున్నాయి. ఆయుర్వేద శాస్త్రంలో కూడా ఈ మహర్షికి విశిష్టస్థానం ఉన్నది.

భరద్వాజగోత్రం త్రయార్షేయిం. ఈ గోత్రప్రవరలో ఆంగీరస, బార్హస్పత్యులనే మటి ఇద్దఱు ఋషులున్నారు. అంగిరసుడు కూడా సప్తర్షులలో పరిగణింపబడినవాడే. ఇతడు సప్తర్షులలో ప్రముఖుడనే విషయం "**అథాంగిరస మగ్రణ్యమ్**" అనే కాళిదాస కృతకుమార సంభవ (షష్టసర్గలోని) సూక్తివల్ల తెలుస్తున్నది. అంగిరసుని కుమారుడు ఆంగీరసుడు. ఇక బార్హస్పత్య మహర్షినామం కూడా ఋగ్వేదం ప్రథమ మండలంలోని మంత్రద్రష్టలలో కన్పిస్తున్నది. "**భారద్వాజ బార్హస్పత్యః**" అనే ఋషి దర్శించిన పలుసూక్తులు ఋగ్వేదంలో ఉన్నాయి. ఈ విధంగా భారద్వాజ గ్రోత్రప్రవరలోని ఋషిత్రయం విలక్షణ వైభవాన్ని కల్గినది. భగవద్రామానుజులకు పంచసంస్కారాలు అనుగ్రహించిన పెరియనంబి ఎమ్బార్, పరవస్తు పట్టర్పిరాన్ వంటి పలువురు పూర్వాచార్యులు భరద్వాజగోత్రులే.

## 2. ఈయుణ్ణి వంశవైభవం

త్రయార్షేయులైన భారద్వాజగోత్రీయులు వైదికవిద్యను, సంస్కృతిని పరిరక్షించి ప్రచారం చేయడం కోసం భారతవర్షం నలుచెరగుల వ్యాపించారు. తరతరాలుగా తమవంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నారు. తం. వీరిలో ఈయుణ్ణివంశం వారొకరు. శ్రీరామానుజులు విశిష్టద్వైత సిద్ధాంత ప్రచారార్థం నియమించిన 74 వ్వే మంది సింహాసనాధిపతులలో భారద్వాజగోత్రానికి చెందిన ఈయుణ్ణి ప్పిళ్ళై ఆఙ్గాన్ ఒకరు. వీరి వంశంలో జన్మించిన ఈయుణ్ణి మాధవ ప్పెరుమాళ్ నంబిళ్ళైకు సమకాలికులు. వీరిపట్ల తమకు ఉండే అదరంవల్ల, నంబిళ్ళై తమ ఆచార్యులు నంజీయర్ నామమైన మాధవనామాన్ని వీరికి పెట్టారు. వీరు నమ్బిళ్ళైను ఆశ్రయించి, వారి సన్నిధిలో తిరువాయెమొరి కాలక్షేపాన్ని

అధికరించి, వారి దివ్యానుగ్రహానికి పాత్రులైనారు. వడక్కుత్తిరువీధి పిళ్ళై కూర్చిన ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యను నంబిళ్ళై ఈయుణ్ణి మాధవప్పెరుమాళ్కు ఇచ్చి, దానిని కాపాడమని ఆదేశించారు. వీరికి సంప్రదాయంలో ఈయుణ్ణి చ్చిఱియ్యా ర్వానప్పిళ్ళై అని పేరు. వీరి వైభవాన్ని **"యద్వచః సకలం శాస్త్రం యత్రియా వైదికో విధిః, యత్కటాక్షో జగద్రక్షా తం వందే తూ మాధవం మునిమ్"** (ఎవరి సూక్తులు అన్నీ శాస్త్రాలో, ఎవరి అనుష్ఠానం వైదికమైన విధియో, ఎవరి ద్మా కటాక్షం జగత్తుకు రక్షణమో, ఆ మాధవప్పెరుమాళ్ను నమస్కరిస్తున్నాను), **"వరదార్యదయాపాత్రం శ్రీమాధవ గురుం శ్రయే, కురుకాధీశవేదాంత సేవోన్మీలిత వేదనమ్"** (నమ్బిళ్ళై అనుగ్రహానికి పాత్రులు, నమ్మా, స్వార్ల తిరువాయ్ మ్యొరిని సేవించడం వల్ల వికసించిన జ్ఞానాన్ని కలవారైన మాధవప్పెరుమాళ్న ఆశ్రయిస్తున్నాను) అని పిళ్ళైలోకమ్ జీయర్ ఈడు తనియన్ వ్యాఖ్యానంలో ఉట్టంకించిన శ్లోకాలవల్ల తెలియవచ్చు.

ఈయుణ్ణి మాధవప్పెరుమాళ్ కుమారులు ఈయుణ్ణి పద్మనాభప్పెరుమాళ్, మాధవప్పెరుమాల్ తమ పుత్రునకు ఈడువ్యాఖ్యను ప్రసాదించి, దానిని నమ్బిళ్ళై ఆజ్ఞానుసారం వారి వారి యోగ్యతనుబట్టి ఉపదేశించమని ఆదేశించారు. ఆరీతిలోనే పద్మనాభప్పెరుమాళ్ ఈడు శ్రీకోశాన్ని తమ తిరువారాధన గృహంలో ఉంచి, నిధినివలె రక్షించారు. అందువల్లనే వీరు **"యేనావగాహ్య విమలోస్మి శఠారి సూరే ర్వాణీ గణార్థపరిబోధసుధాపగాయామ్, శ్రీమన్మ కుందచరణాబ్జమధువ్రతాయ శ్రీపద్మనాభగురవే నమ ఆచరామః"** అని కొనియాడబడుతున్నారు. వీరు కంచిలోని భట్టర్లు నివసించే వీధిలో ఉండేవారు.

పద్మనాభుల శిష్యులు కోలవరాహప్పెరుమాళ్ అనే పేరు గల నాలూర్పిళ్ళై. వీరికి **"అరుళాళలర్ తిరువడి యూన్జినవర్"** అనే ప్రసిద్ధమైన నామం ఉన్నది. ఈ పేరు కల్గడానికి కారణమైన ఒక ముఖ్య సందర్భం ఇక్కడ ప్రస్తావించ దగినది. నాలూర్పిళ్లై అని ఆచార్యులు పద్మనాభ ప్పెరుమాళ్ను ఆశ్రయించి, వారిని ప్రణిపాతనమస్కార ప్రియవచనాలతో ఆచార్యులకు అనుకూలానువర్తనం చేసి,

వారికి ప్రీతిని కల్గించి, వారిని ప్రపన్నులను చేసికొన్నారు. ఈ విధంగా ఫలసాధనమైన శుశ్రూషను చేసే నాలూర్పిళ్ళైకు మాత్రం "**ఓరాణమ్మరి**"గా పద్మనాభ ప్పెరుమాళ్ ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యను ప్రసాదించదలచారు.

నాలూరెపెళ్ళైను వరదరాజస్వామి కోవెలలోకి తీసికొని పోయి, వరదరాజస్వామికి ఎదురుగా నిలిపి ప్రమాణ పురస్సరంగా "నాకు మీరు దీనిని రక్షిస్తానని అయోగ్యులకు ఉపదేశించినని నాకు మాట ఇవ్వాలి" అని అంటూ శ్రీశఠకోపాన్ని అర్చకులద్వారా వారి శిరస్సుపై పెట్టారు.

అప్పుడు నాలూరెళ్ళై, అమూల్యమైన, రస్యమైన ఈడు వ్యాఖ్యానం అందఱికి అందాలనే ఉదారాశయంతో వరదరాజస్వామి ముఖంవైపు సాభిప్రాయంగా చూస్తూ, తమ తలపై పెట్టిన శఠకోపాన్ని "**అరుకాళణి తిరువడి యూనినవర్**" (వరదరాజస్వామి శ్రీచరణాలకు ఊనికతో ధరించినవారు) అనే వ్యవహారం ఏర్పడేటట్లు గట్టిగా అదిమి పట్టుకొని సంజ్ఞచేశారు. భావజ్ఞుడైన వరదరాజస్వామి నాలూర్పిళ్ళై హృదయాన్ని గ్రహించి, అర్చకముఖంగా మీరు దీనిని "**ఆశ్రయుడైయోరెక్కెల్లామ్ ఆరియర్కాళ్ కూఱుమ్**" అనేటట్లు "ఆశను కలవారందరికి ప్రసాదించండి" అనే దివ్యాజ్ఞను ఇచ్చారు. పద్మనాభప్పెరుమాళ్ తాము తలిచిన రీతిలో కాకుండా వేరు రీతిలో పర్యవసించినప్పటికీ, నాలూర్పిళ్ళై హృదయవైశాల్యాన్ని గమనించి సంతోషించి, ఈడు వ్యాఖ్యానాన్ని కాలక్షేపంగా వారికి అనుగ్రహించారు. దీనిని శ్రీవరవరమునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో "**పాల్గుడనే నాలూర్ పిళ్ళైక్కువర్గామ్**" అని వ్యక్తం చేశారు కదా! నాలూర్పిళ్ళై తమ కుమారులైన తేవప్పెరుమాళు ఈడును ప్రసాదించారు. అనంతరం ఆ తేవప్పెరుమాళ్ ద్వారా తిరువాయ్మొరి ప్పిళ్ళైకు, వారిద్వారా శ్రీమణవాళమహాములకు అందిన ఈడువ్యాఖ్య శ్రీవరవరమునుల ద్వారా విశ్వవ్యాప్తమైనది. ఈ రీతిలో ఈయుణ్ణివంశం ఈడు వ్యాఖ్యాన ప్రచారానికి ప్రధానకారణమైనది. ఈ విషయాలను అన్నిటినీ శ్రీవరవరమునులు ఉపదేశరత్తినమాలైలోని "**శీరార్ వడక్కుత్తిరువీదిప్పిళ్ళై**" అనే 48వ పాశురంలో,

“**ఆన్డై వర్వాల్ పెMD శిటియా గ్వానప్పిళ్ళై**” అనే 49వ పాశురంలో తెలుపగా, శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ తమ వ్యాఖ్యలో వీటిని విశదీకరించారు.

ఈవిధంగా భగవద్రామానుజ సంప్రదాయ ప్రచార పరిరక్షణ దీక్షాదక్షమైన భారద్వాజపవిత్రగోత్రానికి చెందిన ఈయుణ్ణి వంశీయులు ద్రావిడ దేశంలోనేకాక ఆంధ్రదేశంలో సర్వత్ర వ్యాపించి తరాల తరబడి సిద్ధాంత వ్యాప్తికి, రక్షణకు నిరంతరం పాటు పడుతున్నారు. ఆ కుటుంబాలలో ఒక కుటుంబం పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెం ప్రాంతంలోని పెంటపాడు అగ్రహారంలో కొంతకాలం, తూర్పుగోదావరి జిల్లాలోని చిరుతపూడి అగ్రహారంలో కొంతకాలం స్థిరపడ్డారు. 18వ శతాబ్ది ఉత్తరార్ధంలో చిరుతపూడిలో ఉండే పండితవర్యులు, భారద్వాజ గోత్రులైన శ్రీమాన్ ఈయుణ్ణి రామానుజాచార్యులవారిని నరసాపురం వాస్తవ్యులు శ్రీపుప్పాల రమణప్పనాయుడుగారనే భాగవత శేఖరులు ఆశ్రయించి, వారి సన్నిధిలో సంప్రదాయార్థాలను శ్రవణం చేశారు. ఈస్టిండియా కంపెనీలో దుబాసీగా ఉన్నత ఉద్యోగాన్ని చేసి, గొప్ప పలుకుబడిని సంపాదించిన శ్రీరమణప్పనాయుడుగారు గొప్ప సంప్రదాయాభినివేశాన్ని, కార్యనిర్వహణ సామర్థ్యాన్ని కలవారు. ఆచార్య ప్రీత్యర్థం వారి మాటను అనుసరించి నరసాపురంలో ఆదికేశవ ఎంబెరుమానార్ స్వామివార్ల దివ్యాలయాన్ని నిర్మింపజేశారు. ఈ ఆలయ నిర్మాణం శ్రీపెరుంబూదూర్లోని భగవద్రామానుజ దివ్యాలయం నమూనాలో జరగడంవల్ల, ఇచటి ఆచార వ్యవహారాలన్నీ శ్రీ పెరుంబూదూర్ ఆలయ వ్యవస్థాను గుణంగా జరుగుతున్నందున, ఇచటి శ్రీరామానుజుల ఉత్సవ మూర్తికి శ్రీపెరుంబూదూర్లోని శ్రీరామానుజుల ఉత్సవమూర్తితోపాటు ఆఱు నెలలకాలం ఏకాసనంలో తిరువారాధన జరుపబడడంవల్ల నరసాపురం అభినవభూతపురిగా ప్రసిద్ధిచెందింది. గోదావరీ మండల ప్రాంతంలో జగదాచార్యులైన శ్రీరామానుజుల దివ్యాలయం లేని కొరత ఈవిధంగా శ్రీమాన్ ఈయుణ్ణి రామానుజాచార్యస్వామివారి ద్వారా, వారి శిష్యులైన శ్రీమాన్ రమణప్పనాయుడుగారిద్వారా తీరింది. మహావిద్వాన్ ఉ. వే. శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్య స్వామివారు తాము వెలయించిన

అభినవభూత పురీ భగవద్రామానుజ దివ్యావతారోత్సవవర్ణన మహాకావ్యంలో పలుమార్లు ఈ ఇద్దఱు మహనీయుల పేర్లను ప్రస్తావించి కీర్తించిన వైనాన్ని **"భారద్వాజన్వయస్య యతిపుంగవసోదరస్య, ఆర్యస్య శాసనవశాత్ విదధే యతీందోః పుప్పాల వేంకటవిభుః"** ఇత్యాదిగా గమనించవచ్చు. ఈ క్షేత్రానికి శ్రీశ్రీశ్రీవానమామలై చిన్నకలియన్ జీయర్స్వామివారు, జగదాచార్య సింహాసనాధిపతి ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు వంటి మహనీయులు ఎందరో విచ్చేసి మంగళాశాసనం చేసిన వైలక్షణ్యం ఉన్నది. ఈరీతిలో ఈయుణ్ణివంశం నరసాపురం భగవద్రామానుజ దివ్యాలయ నిర్మాణానికి మూలకారణ భూతమై, భగవద్రామానుజ సంప్రదాయ ప్రచారానికి, వైదికధర్మ పరిరక్షణకు పాటుపడింది.

శ్రీమాన్ ఈయుణ్ణి రామానుజాచార్యులవారి వంశానికి చెందిన ఒకకుటుంబం 18వ శతాబ్ది చివరలో అంతర్వేదిపాలెం అగ్రహారంలో స్థిరపడింది. ఈ కుటుంబంలో అవతరించిన శ్రీమాన్ శేషశింగరాచార్య స్వామివారు (మా పితామహులకు పితామహులు) ముముక్షుప్పడి, తత్త్వత్రయ, శ్రీవచనభూషణ, ఆచార్య హృదయాది రహస్యగ్రంథాలపై గంభీరమైన అవగాహనను కలవారు. గొప్ప సాహిత్యశాస్త్రవేత్త, కార్యదక్షులు. వీరి కుమారులు (అస్మత్ప్రపితామహులు) శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారు కూడా కార్యనిర్వహణకుశలులు. భగవద్విషయాదిసంప్రదాయ గ్రంథాలను వారి బావగారైన ఉ. వే. శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్య స్వామివారి సన్నిధిలో సేవించారు. గోపాల కృష్ణమాచార్య స్వామివారు నరసాపురంలో భగవద్రామానుజా వతారోత్సవాలలో నిర్వహించే భాగవత తదీయారాధనకు కుడిభుజమై సహకరించినవారు.

**"ఐహికాముష్మికం సర్వం గురు రష్టాక్షరప్రదః, ఇత్యేవం యే న మన్యంతే త్యక్తవ్యా స్తే మనీషిణః"** (అష్టాక్షరీమహామంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుడే పశువులు, భార్యాది బంధువులు మొదలైన ఐహికఫలాలు, మోక్షం, దానికి ఉపాయంగా చెప్పబడే ఉపాయం మొదలైన ఆముష్మికఫలాలు అన్నీ– అని ఎవరు భావించరో, వారు జ్ఞానులచేత విడువదగినవారు.

# 3. నరసాపురములో భగవద్రామానుజుల ఆలయనిర్మాణము

వైష్ణవసిద్ధాంత ప్రచారమే తమ ధ్యేయముగా తలచిన ఈయుణ్ణి వంశమువారు కొందరు ఆంధ్రదేశమునకు తరలివచ్చిరి. అట్టి కుటుంబములలో ఒక కుటుంబము తూర్పుగోదావరిజిల్లా- చిఱుతపూడి అగ్రహారమున స్థిరపడినది. ఆ కుటుంబమున జన్మించిన శ్రీమాన్ రామానుజాచార్యస్వామివారు అను మహాత్ములు గొప్ప జ్ఞాన, భక్తి, వైరాగ్యములను కల్గినవారై, ఉభయవేదాంత ప్రవర్తకాగ్రేసరులై యుండిరి. ఈ విషయమును వీరిని స్తుతించు శ్లోకములోని **"యస్యానర్ఘగుణాః కదాపి గణితుం శక్యా న సూరివ్రజైః"** అను సూక్తి తెలుపుచున్నది.

క్రీ. శ. 18వ శతాబ్దము ఉత్తరార్ధమున ఈస్టిండియా కంపెనీలో ఉన్నతపదవిని నిర్వహించిన నరసాపురం వాస్తవ్యులగు శ్రీపుప్పాల వేంకట రమణప్పనాయుడుగారను ఆస్తికాగ్రేసరులు ఆ ప్రాంతమున లబ్ధప్రతిష్ఠులగు శ్రీమాన్ ఈయుణ్ణి రామానుజాచార్యులవారిని ఆశ్రయించి, వారి వద్ద సంప్రదాయార్థములను వినిరి. తమకు గురుదక్షిణను సమర్పింప ప్రయత్నించు శ్రీరమణప్పనాయుడుగారిని శ్రీరామానుజా చార్యులుగారు. ఆ ప్రాంతమున ఆచార్యసన్నిధి లేని కొఱతను తీర్చుడని పల్కిరి. వారి మాటను శిరోధార్యముగా భావించిన నాయుడుగారు నరసాపురమున గోదావరీతీరసమీపమున శ్రీపెరుంబూదూరులోనున్న భవద్రామానుజుల దివ్యాలయ సన్నివేశ పద్ధతిలో ఒక కోవెలను నిర్మించి, అందు నిత్యనైమిత్తిక విశేషోత్సవముల నిర్వహణకు తగిన వ్యవస్థను ఏర్పరచిరి. పిమ్మట ఈ ఆలయము. ఆంధ్రదేశమున గల గొప్ప ఆలయములలో ఒకటిగా, నరసాపురము అభినవభూతపురిగా ప్రసిద్ధిచెందినవి. శ్రీరామానుజాచార్యస్వామి శ్రీరమణప్పనాయుడుగారిని ప్రోత్సహించి, ప్రతి సంవత్సరము మేషమాసమున జరుగు భగవద్రామానుజుల అవతారోత్సవములను, శ్రీకేశవస్వామి బ్రహ్మోత్సవములను విశేషముగ వారిచే నిర్వహింపచేయుచుండిరి. ఈ ఉత్సవవైభవమును సుమధుర ప్రబంధములుగ

నిర్మించిన ఉ. వే. మహావిద్వాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారు ఈ విషయమును–

**"అన్వబ్ద మేవ మసమానగుణస్య భార–**
**ద్వాజాన్వయస్య రఘుపుంగవసోదరస్య,**
**ఆర్యస్య శాసనవశాత్ విదధే యతీందోః**
**పుష్పాల వేంకటవిభుః మహ మాదరేణ"**

అనుచు కొనియాడిరి. ఆ మహనీయుల సంకల్పబలమువలననే ఈ నాటికిని ఆ ఉత్సవములు అతివైభవముగ నిర్వహింపబడుచున్నవి. ఈ విధముగ నరసాపురములో భగవద్రామానుజుల ఆలయము వెలయుటకు ఈయుణ్ణివంశము నిదానమయ్యెను. తరువాతి కాలమున శ్రీరామానుజాచార్యులవారి సంతతిలో కొందరు అంతర్వేదిపాలెం గ్రామమునకు వచ్చి స్థిరపడిరి.

## 4. శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామి జననము – విద్యాభ్యాసాదులు

శ్రీమాన్ రామానుజాచార్యస్వామివారి వంశమున జన్మించిన శ్రీమాన్ రంగరామానుజాచార్యులను (రంగాచార్యులని ప్రసిద్ధులు) సాత్వికాగ్రేసరులకు, వారి ధర్మపత్ని ల. స. అలమేలు మంగమ్మగారికిని వారి సుకృతఫలముగా కల్గిన సంతానమే ఆచార్యులవారు. వీరి జననము 1899వ సంవత్సరము (ఏప్రియల్ నెల), వికారి సంవత్సరము, మేషమాసమున, కృష్ణ తృతీయాతిథిలో, జ్యేష్ఠానక్షత్రములో, శుక్రవారమున అంతర్వేదిపాలెంలో జరిగినది. శ్రీరంగాచార్యులుగారు కుమారునకు తమ పితృపాదుల పేరును పెట్టిరి. 5 సం॥ ల చిఱుత ప్రాయములోనే ఆచార్యులవారికి మాతృనియోగము కల్గుటచే, వారి మిగిలిన బాల్యమంతయు తండ్రిగారి, పితామహి అగు రాఘవమ్మగారి సంరక్షణలో గడచెను. చిన్నప్పటినుండి శ్రీస్వామి, పెద్దలు సైతము ఆశ్చర్యపడు

రీతిలో అకలంకమైన ప్రవర్తనను, ఆర్జవగుణమును, "**బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః**" అనునట్లు భగవద్భక్తిని కల్గినవారై యుండిరి.

ఆచార్యులవారికి 14 సం॥లు నిండిన పిమ్మట వారి పితృపాదులును పరనుపదించిరి. అపుడు స్వామిని, వారి ఆచార్యులును, పితామహుల సోదరులును అగు ఉ. వే. శ్రీమాన్ రాఘవాచార్యులుగారు చేరదీసిరి. అప్పటికే శ్రీమాన్ రాఘవాచార్యులుగారు నెల్లూరుజిల్లాలోని మంగళంబాడి అగ్రహారమున స్థిరపడుటచే, ఆచార్యులవారు వారితోపాటుశ అచటికి వెడలిరి. ఆచార్యులవారి బుద్ధివిశేషమును గమనించిన శ్రీరాఘవాచార్యస్వామి వారిని ప్రోత్సహించి, తిరుపతి నగరములోని సంస్కృత కళాశాలలో శాస్త్రవిద్యాభ్యాసమునకై పంపిరి. ఆ కళాశాలలో అధ్యాపకులుగానున్న ఉ. వే. శ్రీమాన్ పురిశై కృష్ణమాచార్యస్వామి, ఉ. కే. శ్రీమాన్ కపిస్థలం దేశకాచార్యస్వామివంటి మహనీయుల దివ్యకటాక్షమునకు పాత్రులైన శ్రీస్వామి, వారి సన్నిధిలో న్యాయ, సాహిత్య శాస్త్రములను అధికరించిరి. అపుడే శ్రీమాన్ పురిశై కృష్ణమాచార్యస్వామి సన్నిధిలో శ్రీభాష్యమును కాలక్షేప మొనర్చిరి.

ఇట్లు స్వామివారికి 20సం॥లు వచ్చువరకు తిరుపతిలో కొంతకాలము, మంగళంబాడిలో కొంతకాలము ఉండిరి. ఆ సమయముననే తమ ఆచార్యులగు శ్రీమాన్ రాఘవాచార్యస్వామివారి సన్నిధిలో ముముక్షుప్పడి, తత్త్వత్రయము, శ్రీవచనభూషణమువంటి రహస్య గ్రంథములను అధికరించి, సంప్రదాయ గ్రంథములలో గాఢమైన జ్ఞానమును సంపాదించిరి.

## 5. ఆ స్వామివారి వివాహము – గృహస్థ జీవనము

నూజివీడు సంస్థాన ఆస్థాన మహావిద్వాన్, ఉ. వే. శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారికి ఆచార్యులవారి పితృపాదులు బావగారివరుస. వీరిద్దరును కృష్ణార్జునులవలె అతిసన్నిహితులై యుండెడివారు. శ్రీగోపాలకృష్ణమాచార్యస్వామి శ్రీ ఆచార్యులవారి గుణ సంపదను చూచి

ముచ్చటపడి, తమ ఏకైకపుత్రిక అగు ల. స. శేషమ్మగారిని స్వామివారికి ఇచ్చి పరిణయమొనర్చిరి.

స్వామివారికి 20 సం॥ లు నిండునప్పటికే కుటుంబభారము నిర్వహింపవలసినచ్చుటచే స్వగ్రామమగు అంతర్వేదిపాలెమునకు తిరిగి వచ్చిరి. పిత్రార్జితముగా లభించిన కొద్దిపాటి క్షేత్రమువలన లభించు ఆదాయముతో కుటుంబమును నిర్వహించుకొనుచుండిరి. ఆదర్శదంపతులగు వీరిరువురకు శ్రీమాన్ రంగరామానుజాచార్యులుగారు (దాసుని పితృపాదులు), శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్యులుగారు, శ్రీమాన్ రాఘవాచార్యులుగారు, శ్రీమాన్ వేంకటకృష్ణమాచార్యులుగారు, శ్రీమాన్ శఠకోప రామానుజాచార్యులుగారు అను అయిదుగురు కుమారులు, ల. స. మంగమ్మగారు, సీతమ్మగారు, ల. స. అమృతవల్లిగారు అను ముగ్గురు కుమార్తెలు కల్గిరి.

శ్వశురపాదులగు (మామగారగు) ఉ. వే. శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్యస్వామి సన్నిధిలో ఆచార్యులవారు భగవద్విషయమును, మిగిలిన దివ్యప్రబంధవ్యాఖ్యానములను అధికరించిరి. అట్లే, వారి వద్ద శ్రౌత స్మార్తములకు సంబంధించిన పలు రహస్యములను గ్రహించిరి. ఆచార్యులవారిని శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్యస్వామి పుత్రనిర్విశేషముగా అభిమానించి, ఆదరించిరి. నరసాపురములో తాము నిర్వహించు భగవద్రామానుజుల అవతార మహోత్సవములలో ఆరవ ఉత్సవమున జరుగు కూరేశవిజయ శ్లోకానుసంధానమును శ్రీస్వామివారిచే చేయించుట ఇందులకొక నిదర్శనము. శ్రీస్వామివారు నరసాపురములో ఆ సమయమున వేంచేసి యున్న ఉ. వే. శ్రీమాన్ మందసా రామానుజాచార్య స్వామివారి సన్నిధిలో అనందాళ్వాన్ వాదములను కొన్నిటిని అధికరించిరి.

## 6. ఆచార్యులవారి ప్రవచనము

స్వామివారి కనిష్ఠ పితామహులు, వారిని చిన్నప్పటినుండి చేరదీసి పెంచినవారు, వారి ఆచార్యులు అయిన శ్రీమాన్ రాఘవాచార్యస్వామి

ఆచార్యులవారి జ్ఞాన, భక్తి, వైరాగ్యములను చూచి, "వళర్ త్తదనాల్ పయన్ పెఱ్ఱేన్ వరుక వెన్ఱు" అనునట్లు సంతోషించి, తమ చరమదశలో, తమకు పిమ్మట "ఆమ్ ముదల్వన్ ఇవన్" అనునట్లు ఆచార్యస్థానమును ఆచార్యులవారే నిర్వహింపతగునని నిర్ణయించిరి. స్వామివారిని ఆశ్రయించి, ఉజ్జీవించిన బంధువులు, శిష్యులు ఎందరో కలరు. వారిలో దాసుడొకడు. అట్లే, శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారు తాము వేంచేసి యుండగానే, ఆచార్యులవారిని ప్రోత్సహించి, వారిచే సంప్రదాయ గ్రంథప్రవచనములను ప్రారంభింపజేసిరి. ఇట్లు ఆ స్వామి సన్నిధిలో మొట్టమొదట భగవద్విషయమును గ్రహించిన అదృష్టము వారి పితృవ్యకుమారులగు ఉ. వే. శ్రీమాన్ రాఘవాచార్యస్వామి, ఉ. వే. శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివార్లకు కల్గినది. పిమ్మట వారి సన్నిధిని ఆశ్రయించిన కుమారులు, పలువురు బంధువులు, శిష్యులును రహస్యగ్రంథములను, భగవద్విషయాది దివ్యప్రబంధవ్యాఖ్యానములను కాలక్షేపమొనర్చిరి. వారిలో అస్మజ్జనకులగు ఉ. వే. శ్రీమాన్ రంగాచార్యస్వామి, పితృవ్యులగు ఉ. వే. శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్యస్వామి, ఉ. వే. శ్రీమాన్ శఠకోప రామానుజాచార్యస్వామి మున్నగువారు పేర్కొనదగినవారు.

ఆచార్యులవారు కావ్యపాఠములను చెప్పు శైలి సరళమై, సర్వజన గ్రాహ్యమై యుండును. వారివలె బంధువులలో కావ్యనాటకాదులను పాఠము చెప్పువారు వేరొకరు లేరను ప్రసిద్ధిని పొందిరి. మితభాషియు, మృదుభాషియు, స్మితపూర్వభాషియు ఆగు ఆచార్యులవారు. కాలక్షేపమును అనుగ్రహించు రీతియు "పేదైక్కుమ్ పెణ్ణుక్కుమ్" అనునట్లు ఆబాలగోపాలము. అర్థము చేసికొనగలిగినట్లుండును. "ఆకారసదృశః ప్రజ్ఞః ప్రజ్ఞయా సదృశాగమః" అనునట్లు స్వామి దివ్యమంగళరూపము, జ్ఞానము, భక్తి, వైరాగ్యములు అసాధారణములై, ఒకదానికొకటి తీసిపోనట్లుండును. "జ్ఞానవైరాగ్యరాశయే, అగాథ భగవద్భక్తిసింధవే" అను సూక్తికి స్వామివారు ఒక చక్కని నిదర్శనము.

శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్యస్వామి కొంతకాలము నరసాపురం కోవెలలో సంస్కృతపాఠశాలను నిర్వహించిరి. అందు ఆచార్యులవారు ప్రధాన అధ్యాపకపదనిని నిర్వహించిరి. కొన్ని కారణములచే ఆ పాఠశాల ఎక్కువ కాలము జరుగలేదు.

## 7. శ్రీస్వామి వైదుష్యము– మహనీయుల ప్రశంస

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ పెద్దజీయర్ స్వామివారు ప్రతియేడు విజయవాడలో దసరా నవరాత్రులలో ఉభయవేదాంత ప్రవచనసభలను జరిపెడివారు. ఆ సభలకు వారు మన స్వామివారిని ప్రతిసంవత్సరము ఆహ్వానించెడివారు. ఇట్లు విజయవాడ సభలలో పలుమార్లు స్వామివారు ఉపన్యాసకులుగానే కాక, శ్రీభాష్య, భగవద్విషయ గోష్ఠులలో అధ్యక్షులుగా కూడ పాల్గొనిరి. శ్రీపెద్దజీయర్ స్వామివారికి ఆచార్యులవారి విషయమున పరిపూర్ణమైన గౌరవమును, అభిమానమును కలవు. ఆంధ్రదేశములో ఉభయవేదాంత ప్రవచన దక్షులగు అతికొద్దినుంది. పండితులలో ఒకరుగా స్వామివారిని జీయర్ స్వామి వారు పరిగణించిరి. శ్రీ చిన్నజీయర్ స్వామివారును ఒక పర్యాయము తామే స్వయముగా అంతర్వేదిపాలెం గ్రామమునకు విచ్చేసి, ఆచార్యులవారికి సుంగళాశాసనములను చేసిరి.

కాంచీమహావిద్వాన్, పద్మవిభూషణ, ఉ. శే. శ్రీమాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారికి ఆచార్యులవారి పట్ల గల స్నేహము, గౌరవమును మిక్కిలి గొప్పవి. వారిద్దటి మధ్య తరచు పలు విషయములనుగూర్చి ఉత్తర ప్రత్యుత్తరములు జరుగుచుండెడివి. శ్రీకాంచీస్వామివారు తాము ప్రచురించు ప్రతిగ్రంథమును ఆదరముతో స్వామికి అనుగ్రహించెడివారు. వారితో కలసి ఆచార్యులవారు 1956వ సం॥వ ఉత్తరభారతదేశములోని దివ్యతిరుపతులను దర్శించిరి.

శ్రీకాంచీస్వామి తాము నిర్వహించు "**శ్రీరామానుజన్**" (256, 257) అను తమిళమాసపత్రికలో "అడియేన్ మదిత్త ప్రవచనకర్తాక్కళ్", అను శీర్షికలో

ఆచార్యులవారినిగూర్చి సాయించిన సూక్తు లిచట యథాతథముగా ఉట్టంకింపబడుచున్నవి.

"గోదావరిజిల్లా, నరసాపుర సమీపత్తిల్ అంతర్వేదిపాళెమ్ ఎన్నుమ్ అగ్రహారత్తిల్ ఎழுన్దరుళి యిరుక్కిఱ ఇన్ద స్వామి, తిరుప్పతి సంస్కృత విద్యాలయత్తిల్ సాహిత్య, శాస్త్రఙ్గళై వాశిత్తు, ఉభయవేదాంతఙ్గళైయుమ్, రహస్య గ్రంథఙ్గళైయుమ్ వరియడైవే కఱ్ఱు, మికచ్చిఱన్ద విద్వానాక విళఙ్గి వరుకిన్ఱార్. "అరుళిచ్చెయల్ కడలిల్ ఆழ்న్దవర్" ఎన్నుమ్ శిఱప్పుప్పెఱ్ఱవర్. పరమసాత్త్వికరాన ఇన్ద స్వామియై అడియేన్ నాడోఱుమ్ నినైప్పన్"' (గోదావరిజిల్లా, నరసాపుర సమీపమున అంతర్వేదిపాళెం అను అగ్రహారములో వేంచేసి యుండు ఈ స్వామి తిరుపతి సంస్కృత కళాశాలలో సాహిత్యమును, శాస్త్రములను చదివి, ఉభయ వేదాంతగ్రంథములను, రహస్యగ్రంథములను, సంప్రదాయక్రమములో అధికరించి, గొప్ప విద్వాంసులుగా వెలుగొందుచున్నారు. "దివ్యప్రబంధసూక్తి సముద్రమున అవగాహించినవారు" అను వైశిష్ట్యమును పొందినవారు. పరమసాత్త్వికులగు ఈ స్వామిని నేను ఎల్లప్పుడును స్మరింతును).

ఈ సూక్తులవలన ఆచార్యులవారి పట్ల శ్రీకాంచీ స్వామివారికి గల గౌరవము ఎంత గొప్పదో తెలియుచున్నది.

ఆచార్యులవారు పరమపదించుటకు కొద్ది దినములకు ముందు, పాలకొల్లులో జరిగిన ఉభయవేదాంతసభలకై వేంచేసిన మహోనుహోపాధ్యాయ, కవిశాబ్దికకేసరి, ఉ. వే. విద్వాన్ శ్రీమాన్ S. N. C. రఘునాథాచార్యస్వామివారు (వరంగల్లు) అంతర్వేదిపాలెంకు వచ్చి, ఆచార్యులవారితో మూడు దినములు గడపిరి. ఆచార్యులవారి అగాథమైన ఉభయవేదాంత వైదుష్యమునకు అచ్చెఱువొందిన శ్రీరఘునాథాచార్యస్వామి తిరిగి వెళ్లిన పిదప అనుగ్రహించిన శ్లోకరత్నములు ఇచట ఉదాహరింపబడుచున్నవి

**విద్యావినయసంపత్తిం సదాచారైకనిష్ఠతామ్,**
**అంతఃకరణవృత్తిం చ ప్రసన్నా మనసూయతామ్।**

**అవేక్షమాణో భవతో గుణరత్నైకశేవధిమ్,**
**ఆచార్యకం యుక్తరూపం నాధ్యవస్యతి కో బుధః? ॥**

శ్రీ ఆచార్యులవారి షష్ట్యబ్దపూర్త్యుత్సవములు 1959వ సం॥న వారి కుమారులచే, శిష్యుల ప్రోద్బలముతో వైభవముగా నిర్వహింపబడినవి. ఆ సందర్భమున ఉ. వే. శ్రీమాన్ గొడవర్తి శఠకోపాచార్యస్వామి, ఉ. వే. శ్రీమాన్ కిడాంబి వేంకటనరసింహాచార్యస్వామి మొదలగు పండితులు పలువురు విచ్చేసిరి అట్లే, 1975, 1979, 1983వ సంవత్సరములలో కూడ ఆచార్యులవారి తిరునక్షత్రోత్సవములు విశేషముగ నిర్వహింపబడినవి.

కేవలము నివృత్తిమార్గముననే జీవితమును గడపిన ఆచార్యులవారు ఏనాడును గ్రంథరచనకై ప్రయత్నింపలేదు, తమ శ్వశురపాదుల విషయమున అనుగ్రహించిన మంగళాశాసన స్తోత్రమొకటి కలదు. అప్పుడపుడు ఆత్మీయుల ప్రార్థనపై రచించిన కొన్ని వ్యాసములు కలవు.

ధర్మశాస్త్ర విషయములలో కూడ స్వామివారికి తలస్పర్శి అయిన జ్ఞానము కలదు అపరప్రయోగవిధానమునుగూర్చి శ్రీఆచార్యులవారు విపులమైన వివరణముతోకూడిన గ్రంథము నొకదానిని రచింపనెంచి, చాలవరకు పూర్తిచేసిరి. చివర కొంతభాగము మాత్రము అసంపూర్ణముగా నిలచిపోవుట నిజముగా అస్మదాదుల దురదృష్టము.

## 8. శ్రీస్వామి కైంకర్యనిరతి

శ్రీమణవాళ మహామునులకువలె అచార్యులవారికి దివ్యప్రబంధ సూక్తులపై లెక్కలేనంత మక్కువ. నిరతము దివ్యప్రబంధానుసంధానముతో కాలము వెళ్లబుచ్చెడివారు. ? "**ఓవాత్తొయ్దిల్ శార్ జ్గన్ తొలె శరై నన్నెఞ్జే! ఓవాద వూణాక ఉణ్**"అను నమ్మాళ్వారుల సూక్తికి ఆచార్యులవారు ఒక విశిష్టమైన ఉదాహరణము.

నరసాపురములోని భగవద్రామానుజులవారి కోవెలలో ప్రతి ఏడు జరుగు భగవద్రామానుజ దివ్యావతారోత్సవములలో కొంతకాలము నాలాయిర

దివ్యప్రబంధసేవ, పండితసభలు శ్రీమాన్ గోపాలకృష్ణమిచార్యస్వామివారిచే నిర్వహింపబడినవి. కాని, కాలక్రమమున అవి నిలచిపోయినవి. ఆ కార్యక్రమములను రెండింటిని ఆచార్యులవారు పునః ప్రారంభించి, నిర్వహించిరి. అందులకు తమ శిష్యులును, మహోదారులును, పరమభాగవతులును అగు శ్రీమాన్ రుద్రరాజు నరసింహరాజుగారి ప్రోత్సాహమును లభించినది. ఇట్లు ఆచార్యులవారు ఆళ్వార్లపట్ల, భగవద్రామానుజులపట్ల, కూటస్థులగు శ్రీరామానుజాచార్యస్వామిపట్ల, శ్వశురపాదుల పట్ల తమకు గల కృతజ్ఞతను సార్థక మొనర్చుకొనిరి. ప్రస్తుతము ఆ కైంకర్యమును శ్రీస్వామివారి జ్యేష్ఠకుమారులగు శ్రీమాన్ రంగాచార్యస్వామి (దాసుని పితృచరణులు) నిర్వహించుచున్నారు.

## 9. శ్రీస్వామి అవతారసమాప్తి

"**ఇానమనుట్టాన మిదై నన్హాకవే యుడైయనాన**" అను సూక్తికి శ్రీస్వామిః ప్రథమోదాహరణము. అజాతశత్రువుగ, అపర మహర్షివశిష్ఠులుగ పేరు పొందిన శ్రీ ఆచార్యులవారు 84 సం॥ ల కాలము పరిపూర్ణమైన, ఆదర్శవంతమైన జీవితమును గడపిరి. 1979వ సంవత్సరమున వారికి తీవ్రమైన అనారోగ్యము కల్గినను, భగవదనుగ్రహముచే తిరిగి స్వస్థత చేకూరినది. మరల 1983వ సంవత్సరము ఆగస్టు నెలలో వారికి అనారోగ్యము ఏర్పడినది. ఈ పర్యాయము భగవానుని నిర్ణయము వేరుగా నుండెను. శ్రీస్వామివారు 1983వ సంవత్సరము సెప్టెంబరు 10వ తేదీ ఆదివారంవాడు, అనగా, రుధిరోద్గారి భాద్రపద శుద్ధపంచమి. తెల్లవారుజామున 3 గం॥ల ప్రాంతమున స్వాచార్యశ్రీపాద సన్నిధిని చేరిరి. అంతటితో సుమారు 80 సం॥లకు పైగా ప్రకాశించి, గోదావరీ తీర ప్రాంతమును దీప్తిమంతము చేసిన జ్ఞానదీపము ఆరిపోయినది.

శ్రీస్వామివారి పరమపదగమనవార్తను విని శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారు. తమ దుఃఖాతిరేకమును వెల్లడించుచూ ఈ క్రింది శ్లోకములను అనుగ్రహించిరి.

**"వేదాంతయుగ్మవిపినాంతరనిత్యచారీ,**
**శ్రీశేష శింగరగురుః విబుధాగ్రగణ్యః,**
**నిస్సీమనిస్సమగురుః విలసచ్చరిత్రో**
**దైవేన హంత! విదధే స్మృతిమాత్రశేషః॥**
**పితృపాద వియోగవిహ్వలానాం,**
**ప్రియసౌదర్యవిభాసి మానసానామ్,**
**భవతాం సమభాగితా మహం చ,**
**ప్రతిపన్నో హృది గాఢరూఢశోకః।**
**మిథ్యైవాశ్రితవాత్సల్య మీశ్వరస్యేతి మన్యతే,**
**తథ్యం తు తస్య స్వాతంత్ర్యం నిరంకుశతయోల్బణమ్"**

శ్రీస్వామివారు ఈనాడు మన మధ్య లేకున్నను, వారు చూసిన సన్మార్గము, చేసిన సదుపదేశములు చిరకాలము మన హృదయములలో నిలచియుండును.

**శ్రీమద్భరద్వాజకులప్రదీపమ్**
**శ్రీరంగరామానుజసూరిసూనుమ్।**
**ఆచాంతవేదాంతయుగాంబురాశిమ్**
**శ్రీశేషసింహార్యవరం ప్రపద్యే ॥**

★★★★★

## శ్రీస్వామివారి నిత్యతనియన్

భారద్వాజకులాబ్ధిపూర్ణశశినః శ్రీరంగరామానుజాత్

జాతం తత్కులరాఘవార్యచరణద్వంద్వారవిందాశ్రయమ్।

ఆత్రేయాన్వయసింధుశీతకిరణాత్ గోపాలకృష్ణాద్గురోః

సంప్రాప్తోభయవేదశీర్షహృదయం శ్రీశింగరార్యం భజే॥

## శ్రీస్వామివారి తిరునక్షత్ర తనియన్

శ్రీమత్యబ్దే వికారిణ్యశిశిరకిరణే మేషగే చైత్రమాసే

కృష్ణే పక్షే తృతీయాతిథియుత మఘువద్ధిష్ణ్యగే కావ్యవారే ।

భారద్వాజాన్వవాయాంబుధిసితకిరణాత్

రంగరామానుజార్యాత్ ప్రాదుర్భూతో గుణాఢ్యో భువి గురు

రనఘః శేషసింహార్యనామా ॥

## శ్రీస్వామివారి వాళ్తిత్తిరునామము

శిత్తిరయిల్ కేట్టైనన్నాళ్ శిఱన్దుదిత్తోన్ వాళ్తియే,

శీర్ మైమికు రంగరామానుశర్ తనయన్ వాళ్తియే

ఉత్తమ పారత్తువాశమ్ ఉయర వన్దోన్ వాళ్తియే,

ఒణ్మై తరుమ్ రాఘవర్ తాళ్ ఉయ్ న్దడైన్దోన్ వాళ్తియే,

నిత్తియమ్ గోపాలకృష్ణర్ నినైవుడైయోన్ వాళ్ళియే,
నిఱై ఞాన మనుట్టానమ్ నిమిర నిన్ఱోన్ వాళ్ళియే
ముత్తినెఱి శేర్ కలైకళ్ మూణ్డురైప్పోన్ వాళ్ళియే,
మూదఱిఞ్ఞన్ శేషశింగన్ మొయ్ మ్మలర్ త్తాళ్ వాళ్ళియే

## మంగళాశాసనశ్లోకము

వేదాంతయుగళాంబోధిమంథరాయితచేతసే ।
శ్రీశేషశింగరార్యాయ నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥

## శ్రీస్వామివారి ఆచార్యుల (రాఘవాచార్యులవారి) నిత్యతనియన్

భారద్వాజకులాబ్ధిపూర్ణశశినం శ్రీశేషవర్యాత్మజం
తద్వంశోద్భవ వేంకటార్యచరణద్వంద్వారవిందాశ్రయమ్ ।
శ్రీరామానుజ దేశికేంద్రకృపయా సంసిద్ధబోధోజ్జ్వలం
సేవే శాంతిశమాది భూషణయుతం శ్రీ రాఘవార్యం గురుమ్॥

★★★★★★★

# అస్మత్పితృపాదులు
# న్యాయవేదాంత విద్వాన్, ఉభయవేదాంతభాస్కర
# ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగరామానుజాచార్యస్వామివారి
# వైభవ సంగ్రహం

శ్రీరంగరామానుజాచార్యస్వామివారి ఏకైకసంతానమే అస్మత్పితామహ చరణులు ఉ. వే. మహావిద్వాన్ శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామివారు. అయిదేళ్ల వయస్సులోనే మాతృవియోగం, 14 సంవత్సరాలకే పితృవియోగం కల్గిన వీరిని, వీరి ఆచార్యులు, కనిష్ఠ పితామహులైన శ్రీమాన్ రాఘవాచార్య స్వామివారు ఆదరించి, అభిమానించి, రహస్య గ్రంథ కాలక్షేపాదులను అనుగ్రహించారు. పితామహపాదులు తిరుపతి సంస్కృత కళాశాలలో కొంతకాలం న్యాయవేదాంతసాహిత్య మీమాంసాది శాస్త్రాలను శ్రీకపిస్థలం దేశికాచార్య స్వామివారు, అనన్తాట్పిళ్ళై శ్రీపురిశై కృష్ణమాచార్యస్వామివారు మొదలైన ఉద్దండపండితుల సన్నిధిలో అధ్యయనం చేశారు. వీరు కిడాంబి గోపాలకృష్ణమాచార్య స్వామివారి పుత్రిక శ్రీమతి శేషమ్మగారిని వివాహ మాడారు. తరువాత అంతర్వేదిపాలెంలో స్థిరపడి, నిరంతరంగా విశిష్టాద్వైతసంప్రదాయ, సిద్ధాంత ప్రచారాన్ని చేశారు, భగవద్విషయాన్ని తమ శ్వశురపాదులు శ్రీకిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారి సన్నిధిలో, శ్రీభాష్యాన్ని శ్రీపరిశై కృష్ణమాచార్య స్వామివారి సన్నిధిలో సేవించారు. తమ శ్వశురచరణులు నరసాపురంలో గవద్రామానుజావతారోత్సవాలలో నిర్వహించే తదీయరాదాన కార్యక్రమంలో తమ తండ్రిగారివలె పరిపూర్ణమైన సహకారాన్ని అందించారు. శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్యస్వామివారుకూడ మా పితామహ పాదులను పుత్రనిర్విశేషంగా అభిమానించారు. భగవద్రామానుజ అవతారోత్సవాలలో ఆఱవనాడు జరిగే కూరేశ విజయానుసంధానాన్ని శ్రీగోపాలకృష్ణమా చార్యస్వామివారు తమ జామాత శేషశింగరాచార్య

స్వామివారిచే చేయించడం దీనికొక నిదర్శనం. అపర పశిష్ఠులు, పరమశాంతులైన మా పితామహులు, శ్రౌతస్మార్తషోడశసంస్కార నిర్వహణలో, జ్యోతిషంలో కడు సమర్థులు. శ్రీ పెద్దజీయర్ స్వామివారి, శ్రీ తె. కం. గోపాలాచార్య స్వామివారి గౌరవానికి పాత్రమై, పలుఏండ్లు విజయవాడలో జరిగిన ఉభయవేదాంత పండిత సభలలో ఉపన్యాసకులుగా, అధ్యక్షులుగా పాల్గొన్నారు. శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారివంటి విద్వద్వరేణ్యుల మన్నలను పొందిన మహనీయులు, మా పితామహచరణులు.

శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామివారు, శ్రీమతి శేషమ్మ దంపతులకు (అస్మత్పితామహీ పితామహ పాదులకు) అయిదుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలిగారు. వారిలో మా తండ్రి గారైన ఉ. వే. శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారు పెద్ద కుమారులు, మిగిలిన నల్గురు వరుసగా – ఉ. వే. శ్రీమాన్ గోపాల కృష్ణమాచార్యస్వామివారు, ఉ. వే. శ్రీమాన్ వెంకట రాఘవాచార్యస్వామివారు, ఉ. వేశ్రీమాన్ వేంకటకృష్ణమాచార్య స్వామివారు, ఉ. వే. శ్రీమాన్ శఠకోపరామానుజాచార్య స్వామివారు, ముగ్గురు కూతుళ్ళు – శ్రీమతి మంగతాయారు గారు, శ్రీమతి సీతమ్మగారు, శ్రీమతి అమృతవల్లిగారు,

శ్రీమాన్ రంగాచార్యస్వామివారు నూజివీడులో తమ మాతామహపాదుల ఇంటిలో జన్మించారు. వీరి ప్రాథమిక విద్యాభ్యాసం, కావ్యనాటకాలంకారాదుల అధ్యయనం తండ్రిగారైన శ్రీమాన్ శేషశింగరాచార్య స్వామివారి సన్నిధిలో జరిగింది. చిన్నతనంనుండి తర్కశాస్త్రాధ్యయనంలో బలమైన అభినివేశాన్ని కల రంగాచార్య స్వామివారు కొంతకాలం నెల్లూరులో బ్రహ్మశ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారు, చతుస్తంత్రి ఉ॥వే॥ శ్రీమాన్ కొన్నమూరు రంగరామానుజాచార్యస్వామివార్లవద్ద ముక్తావళి పర్యంతం ప్రకరణగ్రంథాలను అధ్యయనం చేశారు. తరువాత విజయనగరం మహారాజా వారి సంస్కృతకళాశాలలో తర్కశాస్త్రాధ్యాపకులుగా పనిచేసి, ఉద్యోగంనుండి విరమించి, తూర్పుగోదావరిజిల్లాలోని తమ ఊరు అబ్బిరాజుపాలెంలో విశ్రాంతి తీసికొంటున్న బ్రహ్మశ్రీ వేదాంతం శేషయ్యశాస్త్రిగారి సన్నిధిలో పంచలక్షణి,

సిద్ధాంతలక్షణి, అవయవి, సవ్యభిచారం, శక్తివాదం మొదలైన ఉద్గ్రంథాలను, వాటి క్రోడాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. కుటుంబంయొక్క అప్పటి ఆర్థికసమస్యలవల్ల ఇంటికి తిరిగి వచ్చిన నాయనిగారు కొంతకాలం తరువాత తూర్పుగోదావరి జిల్లాలోని పసలపూడిలో నివసిస్తూ ఉండేవారు, సుప్రసిద్ధ న్యాయశాస్త్ర విద్వాంసులుగా, ఉభయవేదాంత విద్వద్వరేణ్యులుగా పేరు పొందినవారైన ఉ. వే. శ్రీమాన్ గొడవర్తి శఠకోపాచార్యస్వామివారి సన్నిధిలో శ్రుతప్రకాశికా సహితంగా శ్రీభాష్యాన్ని అధికరించారు. సత్ప్రతిపక్షంవంటి కొన్ని తర్కశాస్త్ర గ్రంథాలనుకూడా వారి సన్నిధిలో గ్రహించారు. శ్రీమాన్ పితృపాదులకు అధ్యాపనం చేసిన ఆచార్యులందరూ వారి బుద్ధివైశద్యాన్ని, గ్రహణధారణపటుత్వాన్ని, వివేచనాశక్తిని, వినయాన్ని చూచి చాలా ప్రశంసించేవారు. శ్రీభాష్యాన్ని అధికరించిన తరువాత స్వగ్రామం అంతర్వేదిపాలెంకు తిరిగి వచ్చి, పితృపాదుల సన్నిధిలో శ్రీవైష్ణవసంప్రదాయరహస్య గ్రంథాలను, భగవద్విషయాన్ని, మిగిలిన ద్రావిడప్రబంధ వ్యాఖ్యలను అధ్యయనం చేయడంతో పాటు, శ్రోతస్మార్త వైదికసంస్కారాల నిర్వహణలో, జ్యోతిషంలోని ముహూర్తభాగంలో, ధర్మశాస్త్రాలలో గాఢమైన పరిచయాన్ని సంపాదించారు.

పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది శ్రీశ్రీశ్రీ త్రిదండి పెద్ద శ్రీమన్నారాయణ జీయర్ స్వామివారి, కులపతి ఉ॥వే। శ్రీమాన్ తె. కం. గోపాలాచార్యస్వామివారి ఆదరాభిమానాలను పూర్ణంగా పొందినవారు, శ్రీస్వామివారు. ఒకానొక పర్యాయం నరసాపురంలోని ఆదికేశవ ఎంబెరుమానార్స్వామివార్ల కోవెలలో జరిగిన పండిత సదస్సులో శ్రీమాన్ రంగాచార్యస్వామివారు పెద్దజీయర్ స్వామివారి ఆదేశంపై కప్యాసశ్రుతిని గూర్చి నవీన న్యాయశైలిలో పరిష్కారాలతో ఉపన్యాసం చేయగా, శ్రీజీయర్ స్వామివారు చాలా సంతోషపడి, "**న్యాయవేదాంతవిద్వాన్**" అనే బిరుదును ప్రసాదించారు. శ్రీ పెద్దజీయర్ స్వామివారు విజయవాడలో ప్రతిసంవత్సరం నిర్వహించిన ఉభయ వేదాంత పండిత సభలలో పలు సంవత్సరాలపాటు తమ పితృపాదులైన

ఉ॥మే శ్రీమాన్ శేషశింగరాచార్య స్వామివారితో కలసి ఉపన్యాసకులుగా అన్వయించి, పెద్దల, శ్రోతల మెప్పును పొందారు.

శ్రీమాన్ స్వామివారి ధర్మపత్ని శ్రీమతి సీతమ్మగారు. వీరు, స్వామివారికి రెండవ మేనమామ అయిన ఉ. వే. శ్రీమాన్ కిదాంబి శ్రీనివాసరామానుజాచార్య స్వామివారి కుమార్తె. శ్రీమతి సీతమ్మ గారు **"పత్నీ సుదక్షిణేత్యాసీత్ ఆధ్వరస్యేవ దక్షిణా"** అనే రీతిలో భర్త అభిమతానుసారంగా కుడిభుజమై ప్రవర్తిస్తూ, వారికి ఆనందాన్ని కలిగించే సాధ్వీమణి. వీరికి అళహ శింగరాచార్యులు, భాష్యకారాచార్యులనే మేము ఇద్దరం కుమారులం, ఒక కుమార్తె మా చెల్లెలు శ్రీమతి రంగనాయకి.

శ్రీమానస్వామివారి షష్ట్యబ్దపూర్తి మహోత్సవం 1985 సం॥ ఫిబ్రవరి నెలలో అంతర్వేది పాలెంలో ఆత్మీయుల, బంధువుల సమక్షంలో మూడు దినాలపాటు వైభవంగా నిర్వహింపబడింది. (77వ తిరునక్షత్ర పూర్తిసందర్భంగా) 2002వ సం॥లో, (82వ తిరునక్షత్రోత్సవసందర్భంగా) 2006వ సంవత్సరంలో (86వ తిరునక్షత్రోత్సవ సందర్భంలో) విశేషంగా స్వామివారి తిరునక్షత్రోత్సవాలు నిర్వహింపబడ్డాయి. మళ్ళీ 87వ తిరునక్షత్రోత్సవ శుభసందర్భంగా మూడురోజులపాటు 2011, మార్చి, 21, 22, 23వ తేదీలలో విశేషమైన కార్యక్రమాలు ఆత్మీయుల, భక్తుల ప్రోత్సాహంతో నర్సాపురంలో జరుపబడ్డాయి. అపుడు నాయనగారికి జరిగిన తులాభార సన్మానం విలక్షణ మైనది.

సహజంగా నివృత్తిమార్గాన్ని ఆశ్రయించిన శ్రీమాన్ రంగాచార్యస్వామివారు గ్రంథరచనకై ఎక్కువగా ప్రయత్నించలేదు. అలర్మేల్ మంగై ప్రపత్తి, అలర్మేల్మంగై మంగళాశాసనమ్ – అనే రెండు అముద్రిత ప్రాచీన లఘుస్తుతులకు శ్రీస్వామివారు సంతరించిన ఆంధ్రవ్యాఖ్య 2000వ సంవత్సరంలో, 2002వ సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానములవారి సప్తగిరి మాసపత్రికలో ధారావాహికంగా ముద్రింప బడినవి.

తమ పితృపాదులైన శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామివారి షష్ట్యబ్దపూర్తి మహోత్సవాన్ని సోదరుల, ఆత్మీయుల, శిష్యుల సహకారంతో ఎంతో వైభవంగా 1959 సంవత్సరంలో శ్రీమాన్ రంగాచార్య స్వామివారు నిర్వహించడమేకాక, తండ్రిగారి తిరునక్షత్రోత్సవాలను విశేషమైనరీతిలో 1975 సంవత్సరంలో, 1979వ సంవత్సరంలో, 1983వ సంవత్సరంలో జరిపి స్వరూపానురూపమైన ఆచార్య కైంకర్యాన్ని చేసుకొన్నారు. నరసాపురంలోని శ్రీఆదికేశవఎమ్బెరుమానార్ స్వామివార్ల దివ్యాలయంలో నూతనరథ నిర్మాణానికి దోహదపడ్డారు. అంతర్వేది శ్రీలక్ష్మీనరసింహస్వామివారి కోవెలలో పలు కైంకర్యాలకు కారణభూతులయ్యారు.

శ్రీ స్వామివారి వైదుష్యాన్ని, సౌజన్యాన్ని గమనించిన పలువురు పెద్దలు, సంస్థలు వారిని విశేషంగా సమ్మానించాయి. 2002వ సంవత్సరంలో తమ పితృచరణులు ఉ. వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్య స్వామివారి దివ్యస్మృతిగా ఉ. వే. శ్రీమాన్ యస్. వి. రంగరామానుజాచార్య స్వామివారు నాయనగారిని సమ్మానించారు. 2005వ సంవత్సరంలో ఉ. వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి స్మారక సమ్మానాన్ని విజయనగరంలో పొందారు. 2008వ సంవత్సరంలో మహాలక్ష్మీయాగ సందర్భంగా శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయర్ స్వామివారు గోపాలదేశిక పురస్కారంతో, 2011వ సంవత్సరంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ జీయరు స్వామివారు గోపాలోపాయన పురస్కారంతో పితృపాదులను సమ్మానించారు. 2008వ సం॥లో హైదరాబాద్లో శ్రీకృష్ణచారిటబుల్ ట్రస్ట్వారు నిర్వహించిన శ్రీజయంతి ఉత్సవాలలో పితృపాదులను సన్మానించారు. 2015వ సం॥లో తిరుపతిలో జరిగిన 16వ శ్రీమహాలక్ష్మీ యాగంలో శ్రీశ్రీశ్రీ శ్రీరామచంద్రరామానుజ జీయరాస్వామివారిద్వారా విశిష్టపండితసమ్మానాన్ని అందుకొన్నారు.

శ్రీమాన్ రంగాచార్యస్వామివారు ఎక్కువగా నివృత్తిమార్గంలోనే తమ జీవితాన్ని గడుపుతున్నారు. వీరి సన్నిధిలో వీరి కనిష్ఠ సోదరులు శ్రీమాన్ శఠకోప

రామానుజాచార్య స్వామివారు కొన్ని సంప్రదాయ గ్రంథాలను అధ్యయనం చేశారు. వీరి జ్యేష్ఠకుమారుడు శ్రీమాన్ ఈ. ఏ. శింగరాచార్యులు (దాసుడు), ఉ. వే. శ్రీమాన్ గౌడవర్తి సుందరరాజన్స్వామివారు భగవద్విషయాన్ని వీరి సన్నిధిలో అధికరించారు. తమవద్దకు ఆసక్తితో వచ్చే ఆస్తికులకు, భక్తులకు సంప్రదాయగ్రంథాలను రహస్యాలను బోధిస్తూ ప్రశాంతమైన జీవితాన్ని నరసాపురంలో శ్రీ ఆదికేశవ ఎంబెరుమానార్స్వామివార్ల సన్నిధి సమీపంలో గల స్వగృహంలో గడుపుతున్నారు. నాయనిగారు ప్రతిసంవత్సరం నరసాపురంలో భగవద్రామానుజుల వారి దివ్యాలయంలో జరిగే వారి అవతారోత్సవాలలో తమ పితృపాదులు మెచ్చిన, భాగవతతదీయారాధనను, నాలాయిరదివ్య ప్రబంధసేవాకాల కైంకర్య నిర్వహణను కొనసాగించడంతోబాటు, ప్రతి ఏడు శ్రీమాన్ తమ పితృపాదుల తిరునక్షత్రోత్సవ సందర్భంగా మూడు రోజులపాటు ఉభయవేదాంత పండిత సభలను అత్యంత వైభవంగా నరసాపురంలో నిర్వహిస్తూ, ఆచార్యులకు ముఖోల్లాసాన్ని కల్గించే సేవను చేసుకుంటున్నారు.

**భారద్వాజసుధాంబోధి దివ్యరాకాసుధాంశవే ।**
**శ్రీమతే రంగరామానుజాచార్యాయాస్తు మంగళమ్ ॥**

**"మంత్రే తద్దేవతాయాం చ తథా మంత్రప్రదేశ్ గురౌ, త్రిషు భక్తి స్సదా కార్యా సా హి ప్రథమ సాధనమ్"** (విష్ణుతత్త్వమ్) – (మంత్రం, ఆ మంత్రంచే ప్రతిపాదింపబడే దేవత, ఆ విధంగానే, మంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుడు – అనే ఈ ముగ్గురి విషయంలో భక్తిని కల్గి ఉండాలి. ఆ భక్తియే కదా భగవత్ ప్రాప్తికి మొదటి సాధనం).

★★★★★

# ఉపోద్ఘాతము

## 1. సంస్కృతస్తోత్రసాహిత్యము– ఉద్భవ వికాసములు :–

సంస్కృతవాఙ్మయమున స్తోత్రసాహిత్యము అతివిస్తృతమైనది, ప్రాచీనమైనదియు. అందు, ఈ శాఖ వివిధ ప్రక్రియలలో విస్తరించి, విశిష్టమైన స్థానమును అలంకరించుచున్నది. వేదకాలముననే ప్రభవిల్లిన ఈ సాహిత్యము, దినదినాభివృద్ధిచెందుచూ ఈ నాటికినీ విస్తరిల్లుచున్నది. ప్రపంచ సాహిత్యమలోనే మొట్టమొదటి సాహిత్యము ఋగ్వేదము. ఋక్ శబ్దము "**ఋచ స్తుతౌ**" ధాతువునుండి పుట్టినదగుటచే, స్తోత్ర సాహిత్యముతోనే ప్రపంచ సాహిత్యము ప్రారంభమైనదని తెలియయుచున్నది. "**తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః**" అను శ్రుతివాక్యములోని "**విటస్యవ**" శబ్దము "**పన– స్తుతౌ**" అను ధాతువునుండి నిష్పన్నమగుట స్తోత్ర వాఙ్మయముయొక్క వేదకాలీనతను ఋజువు చేయుచున్నది.

స్తుతిరూపములగు వేదములలోని పలు సూక్తములు ఆయా దేవతలను ప్రసన్నులను చేసికొనుటకై యజ్ఞయాగాదులలో గానము చేయబడుచున్నవి. ఇట్టి సూక్తము అన్నియు స్తోత్రసాహిత్యములోనికి చేరును. ఈ స్తోత్రప్రక్రియ క్రమముగ లౌకిక వాఙ్మయమునకూడ ప్రవేశించినది. మయూరుడు మొదలగు పలువురు కవులు తమ ఆర్తిని, కోరికలను వెలిబుచ్చుచు రచించిన పలు స్తోత్రములిందులకు తార్కాణములు. ఇవి పద్య గద్యరూపమున, దండకాదిరూపమున, ఇంకను ఉదాహరణాది పలు ప్రక్రియలలో శాఖోపశాఖలుగా వర్ధిల్లినవి.

ఈ సాహిత్యమున మొదట ఉద్భవించిన కృతులలో చాలవరకు కవి ప్రార్థించు ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తులే ప్రధానాంశములుగా కనుపించును. కాని, క్రమముగా స్తోత్రసాహిత్యమున పండిత కవులు తమ ఆర్తిని, కోరికలనే కాక, అభిమతములైన సిద్ధాంతములనుకూడ విషయముగా గ్రహించుట ప్రారంభమయ్యెను, శ్రీశంకరులు రచించిన షట్పదీస్తోత్రము ఇందులకొక నిదర్శనము.

శ్రీవైష్ణవస్తోత్రసాహిత్యమున ఇట్టి కృతులు అనేకములు కలవు. మహనీయులగు ఆచార్యులు. పలువురు భక్తిరసఘనములు, శ్రీవైష్ణవసిద్ధాంత ప్రతిపాదకములగు స్తోత్రములతో ఈ సాహిత్యమును పరిపుష్టము చేసిరి. కులశేఖరకృతముగా చెప్పబడు ముకుందమాల, యామునకృతమగు స్తోత్రరత్నము, భగవద్రామానుజుల గద్యత్రయము, కూరేశుల పంచస్తవియు ఈ కోవలోనికి చేరినవి. **"క్షీరం శర్కరయేవ"** అనునట్లు పరమభోగ్యమైన వీరి మార్గమును అనుసరించుచు కూరేశుల కుమారులలో పెద్దవారగు శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవమనెడి ప్రస్తుత స్తోత్రరాజమును రచించిరి. తరువాతి కాలమున జన్మించిన వేదాంతదేశికులవంటి పలువురు ఆచార్యులు ఈ క్రమమునే గౌరవించిరి. వైష్ణవ సంప్రదాయమునకు చెందిన స్తోత్రములు అన్నియు ఇంచుమించుగా ద్వయ మంత్రములోని అర్థమును ప్రతిపాదించునవిగా పెద్దలు సంభావించుచున్నారు.

## 2. శ్రీ పరాశరభట్టర్ జన్మాదికములు :-

భగవద్రామానుజుల శిష్యులలో అగ్రగణ్యులు, వారికి పవిత్రస్థానీయులు, "నడచునట్టి పతంజలి" గా పేరు పొందిన కూరేశులకు శ్రీరంగనాథుని అనుగ్రహమువలన జన్మించిన కవలలు అగు పుత్రులు ఇరువురిలో శ్రీపరాశరభట్టర్ మొదటివారు. రెండవ కుమారులు వేదవ్యాసభట్టర్ అను నామముతో ప్రసిద్ధులైన శ్రీరామప్పిళ్లై, వీరిద్దరకు ఈ పేర్లను శ్రీరామానుజులు అనుగ్రహించిరని, ఇట్లు ఆ పేర్లను వారికి పెట్టుట ద్వారా రామానుజులు తమ ఆచార్యులగు భగవద్యామునుల కోరికను తీర్చిరను ఐతిహ్యాము శ్రీవైష్ణవ సంప్రదాయచరిత్ర ప్రబంధములలో ప్రసిద్ధము.

కూరేశులు కాంచీపురమునకు దగ్గరలో గల. "కూర" మను అగ్రహారమునకు అధిపతులు. అపారమైన తమ సంపదను అంతటిని తృణప్రాయముగా త్యజించి, శ్రీరామానుజుల పాదములను ఆశ్రయించిరి. వారికి ఏమాత్రము తీసిపోని ఆత్మగుణసంపదను కల్గిన "ఆణ్డాళ్" అను సతీమణి వారి

ధర్మపత్ని. కూరేశుల తండ్రిపేరు దామోదరులని, శ్రీరామమిశ్రులని, అనంతసూరి అని పలు విధములుగా గ్రంథములలో కనుపించుచున్నది. భట్టరు హారీతగోత్రులు, ఆపస్తంబసూత్రులు, తైత్తిరీయశాఖకు చెందినవారు. వీరిది వడమకులము.

శ్రీభట్టర్ జన్మించిన సంవత్సరము శుభకృత్ అని పలు చోట్ల కనుపించుచున్నది. విరోధికృత్ అని కొందఱు తలచుచున్నారు. శుభకృత్ నామ సంవత్సరమని తలచిన, ఆ సంవత్సరము క్రీ. శ. 1062వ సంవత్సరముతో కాని, 1122వ సంము తో కాని సమానమగును. భగవద్రామానుజులు 1017 నుండి 1137 వరకు, అనగా, 120 సం॥లు జీవించిరని సంప్రదాయ చారిత్రకులతో పాటు, పలువురు చరిత్రకారులును అంగీకరించుచున్నారు. శ్రీరామానుజులు పరమపదించు సమయమునకు భట్టరు వయస్సు యౌవనదశకు మించి యుండుటకు అవకాశము కన్పించుటషలేదు. కావున భట్టరు జన్మించిన సంవత్సరము క్రీ. శ. 1122గా అంగీకరించుటయే తగినదని తోచుచున్నది.

భట్టరు వృషభమాసము (వైశాఖమాసము) అనూరాధానక్షత్రమున జనించిరని పలువురు అభిప్రాయపడుచున్నారు. వీరి జీవితకాలమునుగూర్చి పండితపరిశోధకులలో భిన్నాభిప్రాయములు కలవు. పెక్కు ఆధారములనుబట్టి ఈ ఆచార్యులు సుమారు 60 సం॥ల కాలము జీవించియుండిరని తోచుచున్నదని ఉ. వే. శ్రీమాన్ డా॥ M. A. వేంకటకృష్ణన్ గారు, ఉ. నే. S. శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగార్ మొదలగు పండితుల అభిప్రాయము.

బాల్యమునుండి భట్టర్ ప్రదర్శించిన మేథావిలాసము అనితరసాధారణము.

చిన్నతనములోనే ప్రసిద్ధపండితుడగు సర్వజ్ఞభట్టును ఓడించుట, "శిఱుమామనిశర్" అను తిరువాయ్ మొళి సూక్తినిగూర్చి తమ తండ్రిగారైన కూరేశులను ప్రశ్నించుట, (ఈ విషయము "శ్రీపరాశరభట్టార్యః" అని మొదలగు పరాశర భట్టర్ తనియన్ వ్యాఖ్యానములో వరివస్యలో వివరింపబడినది. ) శ్రీరామానుజుల ఆజ్ఞను అనుసరించి, మేల్నాడులోని మాధవసూరి అను పేరును

కల (తరువాతి కాలమున వీరు "నంజీయర్" అని ప్రసిద్ధులు) వేదాంతిని పరాజితుని చేయుట, శ్రీరామానుజులు తమకు పిమ్మట దర్శననిర్వాహకులు భట్టరేనని తెలుపుట మొదలగు సందర్భములు ఈ ఆచార్యుల జ్ఞానాధిక్యమును, బుద్ధివైశద్యమును నిరూపించుచున్నవి. శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకియు భట్టర్ ను తమ పుత్రునిగా స్వీకరించిరని గురుపరంపరా ప్రభావాది గ్రంథములలో కలదు.

వీరికి కూరేశులు పెట్టిన పేరు శ్రీరంగనాథుడు. ఈ విషయము భగవద్గుణదర్పణములోని మొదటి శ్లోకమువలన తెలియుచున్నది. వీరు తిరువరంగప్పెరుమాళ్ భట్టర్, పెరియభట్టర్, భట్టర్ మొదలగు పేర్లతో కూడ ప్రసిద్ధులు, శ్రీరంగేశపురోహితులు, వేదాంతాచార్యభట్టర్, పరవాదిమదహస్తిపంచాననులు మొదలగు బిరుదములు వీరికి కలవు. వీరి భార్య మన్నియమ్మాళ్, కుమారులు ఉద్దండభట్టు, ఇష్టదైవము అళకియ శింగర్ (నృసింహమూర్తి). వీరికి రామావతారమున పక్షపాతము మెండు. భట్టరుకు ఆచార్యులు ఎమ్బార్, కూరేలును. ఎమ్బార్ పంచసంస్కారముల నొనర్చిరి. శ్రీరామానుజులు సాక్షాత్ ఆచార్యులు కాకున్నను, తమను వారి శిష్యులుగా భట్టరు తలచిరి. వీరిని ఆశ్రయించిన వారిలో నంజీయర్, అమ్మణ్ణి ఆళ్వాన్, వీరశిఖామణి పల్లవరాయులు, నమ్బిగోవర్ధనదాసు మొదలగువారు కొందరు.

## 3. భట్టర్ కృతులు :–

భట్టర్ రచించిన గ్రంథములను గూర్చికూడ విమర్శకులలో ఏకాభిప్రాయము లేదు. భట్టర్ రచించిన కొన్ని గ్రంథములు సంస్కృతభాషలో, మఱికొన్ని మణిప్రవాళశైలిలో, కొన్ని పాశురములు తమిళభాషలో ఉన్నవి. లభించు వివరములను బట్టి వీరు రచించిన గ్రంథములు, అందలి విశేషములును సంగ్రహముగ ఈ క్రింద పొందుపరుపబడినవి.

## (a) భగవద్గుణదర్పణముః (శ్రీ విష్ణుసహస్రనామభాష్యము) :-

వేదవ్యాసమహర్షిచే ప్రణీతమైన శ్రీమహాభారతములోని, భక్తశిఖామణి అగు భీష్మాచార్య ప్రోక్తముగా చెప్పబడు శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమునకు భట్టరు రచించిన భాష్యము భగవద్గుణ దర్పణముగా ప్రసిద్ధి జెందినది. "యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః" అని కీర్తింపబడు విష్ణుసహస్రనామములు అన్నియు భగవానుని కల్యాణగుణములను ప్రతిపాదించుచుండుటచే, భట్టరు తమ కృతికి ఈ పేరు పెట్టిరముట స్పష్టము. భట్టరు. జ్ఞానవైశిష్ట్యమును, బుద్ధికౌశలమును గమనించిన రామానుజులు వారిని విష్ణుసహస్రనామమునకు భాష్యమును రచింపవలసినదిగా ప్రోత్సహించిరని, కావుననే రామానుజులు ఆ స్తోత్రమునకు తాము భాష్యమును రచింపలేదనియు పెద్దలు చెప్పుదురు. ఈ భాష్యమున విష్ణుసహస్రనామములయొక్క ప్రామాణ్యమును నిరూపించుట, ప్రతినామమునకు పునరుక్తి లేకుండ సార్థక్యమును నిరూపించుట, నామములకు చక్కని అనుక్రమమును చూపుట, పర- వ్యూహ విభవ- అంతర్యామి-అర్చాత్మకములగు అయిదు విధములైన భగవానుని రూపములను నామములు తెలుపుననుట, భగవదవతారములను నామములు కీర్తించునని వివరించుట అనునవి ఆ వ్యాఖ్యలోని కొన్ని ప్రత్యేకతలు. భాష్యమున భట్టరు ఉదహరించిన పరశ్శత ప్రమాణములు వారి బహుముఖీనమైన శాస్త్ర పాండిత్యమునకు, లౌకికవాఙ్మయములో సైతము వారికి గల గాఢమైన పరిచయమును తెలుపును. వీరి శ్రీగుణరత్నకోశమను దివ్యస్తోత్రము లక్ష్మీదేవి గుణములను నిరూపించునట్లే, భగవద్గుణదర్పణము భగవానుని గుణములను నిరూపించుటచే "**శ్రీరత్నగుణకోశ**" మనదగియున్నది. శ్రీరత్నమనగా భగవానుడే. శ్రీరంగనాథుడు శ్రీదేవికి అభరణమగు రత్నమని "**శ్రీస్తనాభరణం-- చింతామణిమ్**" అను శ్లోకమున,

"**శ్రీరంగాతర్మందిరమ్**" అను శ్లోకమున భట్టరు వర్ణించిరి కదా! ఇందలి శైలి పతంజలి మహాభాష్య శైలిని తలపింపచేయును.

## (b) అష్టశ్లోకి :-

శ్రీవైష్ణవసిద్ధాంతమున రహస్యత్రయముగా చెప్పబడు అష్టాక్షరీమహామంత్రము, ద్వయమంత్రము, శ్రీకృష్ణచరమశ్లోకముల సారమును భట్టరు ఎనిమిది వేర్వేరు వృత్తములలో కూర్చిరి. కావున ఈ కృతికి అష్టశ్లోకి అని పేరు. ప్రపన్నులగు శ్రీవైష్ణవులందఱు నిత్యము ఉదయకాలములో పుండ్రధారణ తరువాత పఠించు స్తోత్రమిది. ఇందు మొదటి మూడు శ్లోకములలో అష్టాక్షరీమంత్రప్రమేయము, నాల్గవ శ్లోకమున తన్మంత్రజ్ఞానఫలమును, అయిదవ, అరవ శ్లోకములలో ద్వయమంత్రార్థము, ఏడవ, ఎనిమిదవ శ్లోకములలో చరమశ్లోకసారమును తెలుపబడినవి. వీరికి పిమ్మట పలువురు ఆచార్యులు రచించిన రహస్యగ్రంథముల కెన్నిటికో ఇది కరదీపిక అయినది ఈ స్తోత్రమునకు శ్రీమణవాళమహామునుల శిష్యులును, అష్టదిగ్గజములలో ఒకరును అగు శ్రీప్రతివాది భయంకరమ్ అణ్ణన్ సంస్కృతమున నాతివిస్తృతమైన వ్యాఖ్యను రచింపగా, కున్దత్తూర్ అయ్యన్ కుమారులు అగు శ్రీనివాసాచార్యులు అను ఆచార్యులు అతివిస్తృతమైన, రమణీయమైన వ్యాఖ్యను మణిప్రవాళ శైలిలో రచించిరి. ఇంకను పలువురు దీనికి వ్యాఖ్యానములను సంతరించింది.

## (c) శ్రీరంగనాథస్తోత్రముః (రంగనాథాష్టకము) :-

శ్రీరంగనాథుని స్తుతించు ఈ కృతిలో 8 శ్లోకములు కలవు. అకలంక బ్రహ్మరాయుడను చోళరాజు కారణముగా కల్గిన మనస్తాపముచే భట్టరు కొంతకాలము తిరుక్కోట్టియూర్ లో నివసించిరి. తాము ఆ విధముగా శ్రీరంగనాథుని వదలి ఉండవలసి వచ్చినందులకు

చింతించుచు భట్టరు, ఆ స్వామిని ఎపుడు సేవింతుమో! అను ఉత్కంఠను ఈ స్తోత్రమున ప్రకటించిరి. ఇందు శ్రీరంగనాథుని పట్ల, శ్రీరంగక్షేత్రము పట్ల, కావేరీనది పట్ల వారికి గల ఆదరాతిశయము వ్యక్తమగుచున్నది. ఇందలి శ్లోకములు కులశేఖరుల పెరుమాళ్ తిరుమొళిలోని పాశురములను, నమ్మాళ్వార్ల తిరువాయ్ మొళిలోని పాశురములను తలపింపజేయును. ఈ స్తోత్రములోని ఏడవ, ఎనిమిదవ శ్లోకములు భట్టరు వేర్వేరు సందర్భములలో అనుగ్రహించిన ముక్తకములని అభిజ్ఞులగు ఆచార్యులు వచింతురు. ఈ స్తుతిని కాంచీ ప్ర. భ అణ్ణంగరాచార్య స్వామివారు వ్యాఖ్యానించిరి.

## (d) శ్రీ గుణరత్నకోశము :-

శ్రీరంగనాయకీ వైభవమును స్తుతించు ఈ స్తోత్రమున 61 శ్లోకములు కలవు. ఇందలి ప్రమేయమును ఈ క్రింది విధముగా విభాగింపవచ్చును.

| శ్లోక సంఖ్య | **విషయము** |
|---|---|
| 1 - 8 | స్తోత్రమును రచించుటకు తమకు ఆవశ్యకమైన వాగ్వైశద్యమును అనుగ్రహింపుమని లక్ష్మీదేవిని ప్రార్థించుట. |
| 9 – 14 | శ్రుతి, స్మృతి, ఇతిహాసాదులకు గొప్పతనము లక్ష్మీవైభవమును ప్రతిపాదించుటచే కల్గినదని తెలుపుట. |
| 15 –18 | లక్ష్మీకటాక్ష వైశిష్ట్యము. |
| 19 – 27 | లీలా విభూతి, నిత్య విభూతులు శ్రీరంగనాయకి యొక్క సామ్రాజ్యములు అనుట. |
| 28 – 35 | లక్ష్మీవైభవమును గూర్చిన శంకా సమాధానములు, భగవానునకు లక్ష్మికిని సమానముగా గల గుణములు, లక్ష్మీదేవికి మాత్రము ప్రత్యేకములైన గుణములు, వాని వైభవము. |
| 36 – 47 | లక్ష్మీదేవి దివ్యరూపవర్ణనము, ఆమె ఆభరణముల సొబగు, ఆమె అవతారములు, అందలి వైశిష్ట్యము. |

48 – 58 దివ్యదంపతుల నిత్యసంశ్లేషము, భగవదవతారములు లక్ష్మీయోగముచే సార్థక్యము నొందుననుట, లక్ష్మీపురుషకారవైభవము.

59 – 61 లక్ష్మీ ప్రపదనముతో స్తుతిని ముగించుట.

## (e) తత్త్వరత్నాకరము :–

ఇది విశిష్టాద్వైతవేదాంత శాస్త్రగ్రంథము. యామునుల సిద్ధిత్రయము, ఆగమప్రామాణ్యములవలె ప్రౌఢమైన ఈ గ్రంథము దురదృష్టవశముచే చాలవరకు లోపించినది. వేదాంతదేశికులు న్యాయపరిశుద్ధిలో, న్యాయసిద్ధాంజనములో ఉట్టంకించిన కొన్ని భాగములు మాత్రమే ప్రస్తుతము లభ్యమగుచున్నవి. ఇట్టి ఉద్ధరణములు సుమారు 70కి పైగా లభించుచున్నవి.

## (f) క్రియాదీపము :–

దీనికే నిత్యమను పేరును ఉన్నట్లు కొందరు తలంచుచున్నారు. భగవద్రామానుజ విరచితమగు నిత్యగ్రంథము అతివిస్తృతమగుటచే భగవదారాధనను గూర్చి సంగ్రహముగా ఒక కృతిని అనుగ్రహింపవలసినదిగ సోమయాజి అను శిష్యులు ప్రార్థింపగా, భట్టరు ఈ గ్రంథమును అనుగ్రహించిరని సంప్రదాయచరిత్ర గ్రంథములలో కనుపించుచున్నది. వేదాంతదేశికులు ఉదహరించిన రెండు ప్రమాణములు తప్ప మిగిలిన భాగమంతయు లుప్తము.

## (g) లక్ష్మీకల్యాణము (రూపకము):–

ఇది భట్టరు రచించిన రూపకము, ఈ గ్రంథముకూడ ప్రస్తుతము పూర్తిగా లభించుట లేదు. గీతాతాత్పర్యచంద్రికలో, రహస్యత్రయసారము, సారసారములను రహస్య గ్రంథములలో

వేదాంతదేశికులు చూపిన కొన్ని భాగములు తప్ప మిగిలిన భాగమంతయు లోపించినది. ఆ ప్రమాణములు ఇవి.

**(a) అనన్యాధీనకల్యాణ మన్యమంగళ కారకమ్ ।**
**జగన్నిదాన మద్వంద్వం ద్వంద్వం వందామహే వయమ్ ॥**

(రహస్యత్రయసారే – 23 అధ్యాయే)

**(b) స్వయం వస్తూకుర్వన్ జన మిమ మకస్మాత్ సరసిజ**
**ప్రకారౌ పద్మాయా స్తవ చ చరణౌ నః శరణయన్**

(సారసారే)

**(c) ధర్మే ప్రమాణం సమయ స్తదీయో వేదాశ్చ తత్వం చ తదిష్టదైవమ్ ।** (గీతాతాత్పర్య –18–14)

**(f) గోష్ఠిపురేశస్తవము :–**

సంప్రదాయములో తిరుక్కోట్టియూర్ అనబడు గోష్ఠిపురములోని. సౌమ్యనారాయణ స్వామిని స్తుతించుచు భట్టరు రచించిన పది శ్లోకములను కల్గిన అఘుస్తోత్రమిది. దీనిని భట్టరు తిరుక్కోట్టియూర్ లో నివసించినపుడు రచించిరని పెద్దలందురు. ఈ స్తోత్రము పూర్తిగా లభించుచున్నది. ప్రచురింపబడినది కూడ. ఈ కృతి పరాశరభట్టర్ రచించినది కాదని శ్రీపద్మనాభన్ మొదలగు విమర్శకులు అభిప్రాయపడుచున్నారు.

**(g) చతుఃశ్లోకి, ద్విశ్లోకి, తనిశ్లోకి**

అను ఈ కృతులు ఆచార్యసూక్తిముక్తావళి అను తెనుగు కావ్యములో, పెరియతిరుముడి అడైవు అను తమిళసంప్రదాయ చరిత్రగ్రంథములో భట్టరుచే రచింపబడినట్లు తెలుపబడినని. ఈ కృతులిపుడు లభ్యమగుటలేదు. M. Krishnamachariar రచించిన History of Sanskrit Literature లో క్షమాషోడశి పరాశరభట్టర్ కృతి అని పేర్కొనబడుట ప్రామాదికమే అగును.

### (h) అధ్యాత్మఖండద్వయవివరణము

న్యాయసిద్ధాంజనమున వేదాంతదేశికులు ప్రమాణములుగా చూపిన రెండు ప్రమాణములు తప్ప, మిగిలిన ఈ గ్రంథము అంతయు నష్టమైనది. జీవపరిచ్ఛేదమున శరీరలక్షణమును నిర్వచించునపుడు, కైవల్యము మోక్షము కన్న న్యూనమని నిరూపించునపుడు దేశకులీ ప్రమాణములను చూపిరి,

### (i) కారణనిర్ణయః

ఇది ఒక ప్రకరణగ్రంథమని, భట్టరు కృతమని కొందలు భావించుచున్నారు. ఇది లభించుటలేదు.

### (j) ఆకారవివరణమ్, దివ్యసూరి ప్రభావదీపికా, అఖండఖండనమ్–

అను వీనిని భట్టరు రచించిరని చెప్పబడుచున్నను వీని వివరములు ఏమియు దొరుకుట లేదు.

### (k) ముక్తకశ్లోకములు :–

భట్టరు ఆయా సందర్భములలో అనుగ్రహించినవిగా చెప్పబడు ముక్తకశ్లోకములు సుమారు 50 కలవు. వీనికి భట్టరు రచించిన చక్కని వివరణముకూడ కలదు. వీటికే నంబెరుమాళ్ తిరుమంజన కట్టియములు అనే పేరు. ఇవి శ్రీరంగనాథుని తిరుమంజన (అభిషేక) సమయమున భట్టరు వంశీయులచే ఈ నాటికిని స్వామి ముందు విన్నపింపబడుచున్నవి. దీనిలో "త్వం మే హం మే", "దిదేవిషతి మానుషః" వంటి అపూర్వ కవితాశోభను కల్గిన ముక్తకశ్లోకరత్నములు ఎన్నియో కలవు. శ్రీనివాసగ్రంథమాలవారు (కాకినాడ) తమ మూడవ పుష్పముగ 1940 సం॥ న శ్రీమత్పరవస్తు గోవిందాచార్యస్వామివారి ఆంధ్రానువాదముతో ఈ భట్టరు ముక్తకములను ప్రచురించిరి. విశిష్టాద్వైతప్రచారిణీసభ, మద్రాస్, ప్రచురించిన భగవద్గుణదర్పణము ఆంగ్లానువాద గ్రంథములోని ఉపోద్ఘాతమున భట్టరు ముక్తకములలో

28 శ్లోకములు ఇవ్వబడినవి. వీనిలో కొన్ని శ్లోకములు వరివస్యలో ఆయా శ్లోకవ్యాఖ్యానములలో ఉదాహరింపబడినవి.

శ్రీవైష్ణవులు నిత్యము అనుసంధించు పొదుత్తనియన్ల (ప్రార్థనాశ్లోకముల)లో ఒకటి అగు "భూతం సర శ్చ" అను శ్లోకమును, తిరుప్పావై దివ్యప్రబంధమునకు తనియన్ అగు "నీలాతుంగస్తనగిరితటీ" అను శ్లోకమును భట్టరు. రచించిరని సంప్రదాయము. వీనిని భట్టరు తిరుక్కోట్టియూర్ లో ఉన్నప్పుడు తమ శిష్యులగు నంజీయర్ పురుషకారముకొఱకు అనుగ్రహించిరని చెప్పబడుచున్నది. భట్టరు ముక్తకముల కవితాసౌందర్యమును, పదప్రయోగచాతురిని నిరూపించుటకు ఈ క్రింది శ్లోకము ఒక్కటి చాలును.

**"దిదేవిషతి మానుషః స చ తితద్విభూషత్యసౌ**
**శశర్విషతి సర్వదా వివిధయిష్యతే తేన చ,**
**ముముక్షిషతి తత్వగత్యవగతేః స నిస్సంశయం**
**నినిత్యిషతి సోప్యహో సచ రిరంగభిక్షూషతి".**

**(1) యమకరత్నాకరము, తద్వ్యాఖ్య, శారీరకవ్యాఖ్య :-**

16 ఆశ్వాసములను కల్గిన ఈ కావ్యమున శ్రీకృష్ణుని అవతారము మొదలు, కంసవధవరకు గల వృత్తాంతము కథాంశము. పెక్కుమంది అభిప్రాయానుసారము యమకరత్నాకరము, తద్వ్యాఖ్యము కూరేశులచే రచింపబడినది అని భావింపబడుచున్నది. కాని, ఈ కావ్యప్రారంభమున వ్యాఖ్యానములో

**"ప్రణిపత్య పరమపురుషం శ్రీవత్సాంకో పరాశరాన్యాహ్వాః,**
**స్వయమేవ యమకరత్నాకరవివృతిం కర్తు మారభతే"**

అని యుండుటనుబట్టి, ప్రథమాశ్వాసమున “స శ్రీవత్సాంకః” అను 39వ శ్లోకముయొక్క వ్యాఖ్యానమున “అస్య హి కావ్యస్య కర్తా కవిః శ్రీరంగనాథేన కథానాయకేన విశేషేణ పరిగృహీతః, తద్దివ్యాజ్ఞాలబ్ధ పరాశరాఖ్యాపర నామధేయః, తాదృశ మపరైః దురధిరోహపద మారూఢోఽభవత్” అని యుండుటనుబట్టి యమకరత్నాకరము, తద్వ్యాఖ్యయు పరాశరభట్టరు రచించిరని కొందఱు విమర్శకులు ఊహించుచున్నారు. కాని, యమకరత్నాకరమును కూరేశుల కంటే వేరొకరు రచించిరని మరికొందరు తలచుచున్నారు.

ఈ వాదమును మహావిద్వాన్ ప్ర. భ. అణ్ణంగరాచార్యస్వామి అంగీకరింపలేదు. వారి అభిప్రాయమిది. పరాశరుడను పేరును కల్గిన శ్రీవత్సాంకులు ఈ కావ్యమునకు కర్త అని స్పష్టముగా తెలియుచున్నది. శ్రీవత్సాంకులను పేరు కూరేశులకు తప్ప వేరొకరికి ఉన్నట్లు ప్రసిద్ధి లేదు. పరాశరుడను వేరొక పేరు కూరేశులకున్నట్లు తెలియదు. ఈ కావ్యములోని 2వ ఆశ్వాసమున 15వ శ్లోక వ్యాఖ్యానమున భగవద్రామానుజులు రచించిన శ్రీభాష్యములోని దహరాధికరణమునందలి సూక్తులను అనువదించి, అందలి అర్థము తమ గ్రంథమగు శారీరకమున ఖండింపబడినదని, ఉక్తి–ప్రత్యుక్తులను అచటనే చూచుకొనవలసినదను వాక్యములు కలవు. వానిని గమనింపగా, ఈ కావ్యము కూరేశకృతము కాదని తోచును. కాని, పైన పేర్కొనిన వాక్యములలో ప్రబలమైన ప్రచురణ దోషమణగియున్నట్లు తోచును. ఈ వాక్యములు గ్రంథకారునినే అయిన ఈ గ్రంథము శ్రీరామానుజుల ప్రత్యర్థిచే. రచింపబడియుండవలెను. కాని, అట్లనుటకు వీలు కన్పింపదు. ఎందులకనగా, గ్రంథ ప్రారంభమున ఆచార్యనమస్కారమును చేయు సందర్భమున నమ్మాళ్వార్లు, ఆళవన్దార్ (యామునులు)తప్ప, రామానుజులకు పిదప జన్మించిన ఆచార్యు లెవ్వరును స్మరింపబడకపోవుటచే, ఈ కవి సాక్షాత్ రామానుజుల శిష్యులని భావింపనగును. గ్రంథములోని శబ్దప్రయోగకౌశలమును,

అర్థరామణీయకమును గమనింపగా, కూరేశులు తప్ప వేరొకరు ఈ కావ్యమును రచించిదని చెప్ప వీలుపడదు. పరాశరనామము శత్రువులను ఓడించువారను అర్థమిచ్చుటచే, యౌగికార్థమునుబట్టి కూరేశులను నిర్దేశించునని ఒక విధముగా అన్వయింపవచ్చును. కావున యమరత్నాకరమును, తద్వ్యాఖ్యము కూరేశకృతములని, భావించుటలో ఎట్టి విప్రతిపత్తియు లేదు. యమకరత్నాకరములోని ప్రథమాశ్వాసమున గల **"రామాఽ పరనామా సా వాచార్యో యస్య తాత ఇత్యోజః"** అను 38వ శ్లోకమును బట్టి కూరేశుల తండ్రి శ్రీరామనామధేయులని తెలియుచున్నది. తన తండ్రి పేరు పుత్రులకు పెట్టుట సాధారణముగా కనుపించు సంప్రదాయము. కూరేశుల పుత్రులలో రెండవవారి పేరు శ్రీరామపిళ్ళై. ఇట్టి పై వివరములన్నియు గమనింపగా, కూరేశులే యమకరత్నాకర కావ్యమును, దాని వ్యాఖ్యను రచించిరని చెప్పవలెను. శారీరకమను వేదాంతగ్రంథమును భట్టరు రచించిరని భావించుటయు యుక్తము కాదు. భగవద్రామానుజుల విషయమున నిరవధికమైన భక్తి ప్రపత్తులను కల్గిన భట్టరు వారి సూక్తులను ఖండించిరనుట సరి కాదు.

ఈ వాదములు ఇట్లుండగా, M. Krishnamachariar రచించిన సంస్కృతవాఙ్మయ చరిత్రలో యమకరత్నాకరము కూరేశుల పౌత్రులగు వేదవ్యాస భట్టరు కుమారులచే రచింపబడినట్లు చూపబడినది.

## (m) సుబాలోపనిషత్ వివరణము

– వేదాంతదేశికులు తత్త్వముక్తాకలాపమను తమ గ్రంథమునకు స్వయముగ రచించిన సర్వార్థసిద్ధి అను వ్యాఖ్యకు వివరణమగు ఆనందదాయినియందు "యదుక్తం భట్టపరాశరపాదైః యది భూతానా మపి ప్రకృతిత్వమ్" అనుచు భట్టరు రచించిన సుబాలోపనిషత్ వివరణముగూర్చి పేర్కొనబడినది. కావున భట్టరు సుబాలోపనిషత్ ను వ్యాఖ్యానించినట్లు తోచును – అని శ్రీ S.

పద్మనాభన్ గారు. అభిప్రాయపడుచున్నారు. కాని, ప్రస్తుతము ఆ వ్యాఖ్య దుర్లభము.

## (n) తిరువాయ్ మొళి తనియన్ పాశురములు

భట్టరు ద్రావిడభాషావైదుష్యమును నిరూపించునట్టి తిరువాయ్ మొళి ప్రబంధ తనియన్ పాశురములు రెండు కనుపించుచున్నవి. "వాన్ తికఴుమ్ శోలై", "మిక్క ఇఱైనిలైయుమ్" అను ఈ రెండు పాశురములలో మొదటి పాశురములో—తిరువాయ్ మొళి ప్రబంధము శ్రీరంగనాథుని గూర్చి రచింపబడినదని, ఆ ప్రబంధమును కన్నతల్లి నమ్మాళ్వార్లు కాగా, పెంచి పెద్దచేసిన తల్లి శ్రీరామానుజులని తెలుపబడగా, రెండవ పాశురమున – ఆ ప్రబంధ ప్రమేయము అర్థపంచకమని సూచింపబడినది. ఇవి రెండును "వెణ్బా" అను తమిళచ్ఛందమున రచింపబడినవి.

## (o) కైశికపురాణవ్యాఖ్య

భట్టరు మణిప్రవాళశైలిలో రచించినట్లు చెప్పబడు గ్రంథములలో ఇది ఒకటి. కైశిక పురాణము వరాహపురాణాంతర్గతము, తిరుక్కుఱుఙ్గుడి అను శ్రీవైష్ణవ క్షేత్రమున కార్తికమాసములోని శుద్ధ ఏకాదశినాటి రాత్రి జరిగిన వృత్తాంతము ఇందలి కథ. పరమభక్తుడగు మాలదాసరి భగవన్నామమును కైశికరాగమున పాడగా, ఆ కీర్తనముయొక్క మహిమచే సమీపముననున్న బ్రహ్మరాక్షసునకు శాపము తీరుట ఈ కథలోని విషయము. దీనిని సాక్షాత్తు వరాహస్వామియే భూదేవికి చెప్పెను. భట్టరు ఈ ఉపాఖ్యానమునకు రస్యమైన వ్యాఖ్యను మణిప్రవాళశైలిలో రచించి, శ్రీరంగనాథునకు సమర్పించిరి. అట్లు సమర్పించిన దినము కార్తీక శుద్ధ ఏకాదశి అగుటకూడ ఇచటి విశేషము. ఆ వ్యాఖ్యను ఆలకించిన శ్రీరంగనాథుడు ముగ్ధుడై, భట్టరుకు పరమపదమును అనుగ్రహింపగా, ద్వాదశీ తిథియందు ఆ ఆచార్యులు పరమపదించిరను ఐతిహ్యము కలదు. దానికి గుర్తుగా ఈ నాటికిని

శ్రీరంగమున కార్తీక శుద్ధ ఏకాదశినాడు భట్టరు వంశస్థులు భట్టరు రచించిన కైశికపురాణవ్యాఖ్యను శ్రీరంగనాథుని ముందు నివేదింతురు. మరునాడు రాజలాంఛనములతో వారిని ఊరేగింపుగా తీసికొనిపోయి, ఇంటి వద్ద విడచివచ్చుట జరుగుచున్నది. ఈ వ్యాఖ్య మణిప్రవాళశైలిలో లభించు అతి ప్రాచీనమైన కృతులలో ఒకటి.

### (p) "మైవణ్ణమ్ నఱుమ్ కుఞ్జి" పాశురవ్యాఖ్య :–

భట్టరు మణిప్రవాళమున రచించిన కృతులలో ఇది వేరొకటి. తిరునెడుందాండక ప్రబంధములోని "మైవణ్ణమ్" అను పాశురమున తిరుమఙ్గై ఆళ్వార్లు పరకాల నాయికాభావనతో భగవానుని విరహామువలన తమకు కల్గిన క్లేశమును ప్రకటించుట ప్రధానవిషయము. ఆలంకారికమూర్ధన్యులగు భట్టరు ఈ పాశురమును వ్యాఖ్యానించిన తీరు అతివిలక్షణమైనది. వారు పరమగహనములైన వేదాంతార్థములను ఆలంకారికశైలిలో నిర్వహించిన పద్ధతి తరువాతి ఆచార్యులకు మార్గదర్శకమైనదనుటలో సందేహము లేదు. ఈ వ్యాఖ్య భట్టరు రచించలేదని పెరియ పరకాల జీయర్ శిష్యులలో ఒకరు రచించిరని శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ తాము ప్రచురించిన తిరునెడుందాండగప్రబంధవ్యాఖ్యాన ప్రవేశమున సోపపత్తికముగా నిరూపించిది.

### (q) మంత్రార్థదీపికై

ఈ గ్రంథము భట్టరు కృతమని చెప్పబడినను, ఎట్టి వివరములు లభించుటలేదు. భట్టరు వంశములో జన్మించినవారు, శ్రుతప్రకాశికాభట్టరు కుమారులును అగు వేదాంతాచార్యభట్టర్ అష్టాక్షరదీపికై అను గ్రంథమును రచించినట్లు ఆచార్యసూక్తి ముక్తావళిలో, పెరియ తిరుముడియడైవులో, పిళ్ళైలోకమ్ జీయర్ రచించిన శ్లోకగురుపరంపరా వ్యాఖ్యలో కలదు. ఈ గ్రంథమే భట్టరు రచనగా పేర్కొనబడినదా? లేక, ఈ గ్రంథము సంస్కృతభాషలో, లేక

మణిప్రవాళమున రచింపబడిన వేరొక గ్రంథమా? అను అంశము స్పష్టముగ తెలియుటలేదు.

### (r) అభిషేకచూర్ణికలు

శ్రీరంగమున స్వామికి అభిషేకమును నిర్వహించు సందర్భమున భట్టరు వంశీయులు విజ్ఞాపించు చూర్ణికలు భట్టరు కృతములని చెప్పబడుచున్నవి.

### (s) దివ్యప్రబంధ వ్యాఖ్యానములలో భట్టర్ నిర్వాహములు

నాలాయిర దివ్యప్రబంధమునకు పలువురు ఆచార్యులు మణిప్రవాళ శైలిలో వ్యాఖ్యలను రచించిరి. ఆ వ్యాఖ్యలో పలుచోట్ల వ్యాఖ్యాతలు ఉట్టంకించిన భట్టరు వివరణములు కానవచ్చుచున్నవి. తిరువాయ్‌మొళికి గల ఈడు అను వ్యాఖ్యానములోనే నూటికి పైన అట్టి నిర్వాహములు కలవు, అనగా, భట్టరు. వివరణములపై ఆచార్యుల ఆదరాతిశయమెట్టిదో స్పష్టమగు చున్నది. ఇట్లే మిగిలిన ప్రబంధముల వ్యాఖ్యలలో భట్టర్ నిర్వాహములు అనేకములు లభించుచున్నవి. ఇవి అన్నియు భట్టర్ సమయస్ఫూర్తికి, శాస్త్ర పరిజ్ఞానమునకు, సహృదయతకు చిహ్నములు. విస్తరభీతిచే ఇచట అని పేర్కొనబడలేదు.

### (t) భట్టరు అనుగ్రహించిన వార్తలు (ఉపదేశములు)

శిష్యులకును, సన్నిహితులకును భట్టరు ఆయా సందర్భములలో ఉపదేశించిన పలు సూక్తులు గురుపరంపరా ప్రభావము, వార్తామాలై వంటి సంప్రదాయ చరిత్ర గ్రంథములలో కన్పట్టచున్నవి. ఇవి భట్టరు వార్తలుగా ప్రసిద్ధి చెందినవి.

ఇవి, తెలిసినంతవరకు పరాశర భట్టర్ అనుగ్రహించిన కృతుల వివరములు.

## (4) శ్రీరంగరాజస్తవమును భట్టర్ రచించిన సందర్భము :-

భట్టర్ జీవించిన కాలమున చోళదేశమును పాలించు వీరసుందరబ్రహ్మరాయుడు (అకలంకబ్రహ్మరాయుడు) కూరేశుల శిష్యుడు.

అతడు శ్రీరంగములోని ప్రాకార మొకటి జీర్ణమగుటచే, తిరిగి నిర్మింపనెంచి, అందులకు అడ్డముగానున్న పిళ్లైపిళ్లై ఆళ్వాన్ అను ఆచార్యుల గృహమును తొలగింపనెంచెను. అట్లు చేయుట తగదని భట్టరు తెలిపినను, ఆచార్యుల పుత్రులను గౌరవమునుకూడ బ్రహ్మరాయుడు వారి పట్ల చూపక, వారి మాటలను ధిక్కరించెను. అతడొనర్చిన అసహ్యమైన ఆ భాగవతాపచారమునకు క్లేశపడిన భట్టరు, ఇక శ్రీరంగమున నివసింపలేక, తిరుక్కోట్టియూరు (గోష్ఠీపురమునకు) చేరిరి, కొంతకాలమైన పిదప బ్రహ్మరాయుడు మరణించెనని తెలిసి, తిరిగి శ్రీరంగమునకు వచ్చుచు, ఆ సమయమున తమకు కల్గిన అనుభవమును ఈ శ్రీరంగరాజస్తవరూపమున ప్రకటించిరట. ఈ వృత్తాంతమును శ్రీ. ప్ర. భ. అణ్ణంగరాచార్యస్వామి తమ వ్యాఖ్యానప్రారంభమున

**"శ్రీగోష్ఠీనగరా న్నివృత్తిసమయే సంతోషవైశద్యతః**
**శ్రీభట్టార్యగురూత్తమో గుణనిధిః శ్రీరంగరాజస్తవమ్,**
**దివ్యం యం రచయాంబభూవ" అనుచు పేర్కొనిరి.**

## (5) శ్రీరంగరాజస్తవస్వరూపము :-

పూర్వోత్తర శతకములుగా విభాగింపబడిన ఈ స్తోత్రము ద్వయమంత్రమునకు వివరణమని ఆచార్యుల తలంపు, అర్చామూర్తులన్నిటిలో అతిప్రాచీనమైనదిగా, మూలకందముగా భావింపబడు శ్రీరంగనాథుని అర్చామూర్తిని స్తుతించును. రచింపబడిన ఈ స్తోత్రము శ్రీవైష్ణవస్తోత్రవాఙ్మయమున ప్రధానస్థానమును అలంకరించుటలో ఆశ్చర్యమేమున్నది!

శ్రీయామునుల స్తోత్రరత్నము శ్రీరంగనాథునిగూర్చియేనని ("కులధనం, కులదైవతమ్" అని యుండుటను బట్టి) ఆచార్యులు తలంచినను, అందు స్పష్టముగా శ్రీరంగనాథుని పేరు ఉట్టంకింపబడలేదు. అట్లు శ్రీరంగనాథుని నామము ఉట్టంకింపబడిన స్తోత్రములలో ఇది మొట్టమొదటిది. కూరేశులు

మొదటగా శ్రీరంగనాయకీస్తుతిని (శ్రీస్తుతిని) రచింపగా, వారి కుమారులగు భట్టరు శ్రీరంగనాథుని మొదటి స్తోత్రమును రచించిరి.

పూర్వశతకమున 127 శ్లోకములు, ఉత్తరశతకమున 105 శ్లోకములను కలవు. ఇందలి ప్రమేయమును ఈ క్రింది విధముగా విభాగింపవచ్చును.

## పూర్వశతకము

| శ్లోకసంఖ్య | విషయము | పరిమితి |
|---|---|---|
| 1–12 | గురుపరంపరావందనము | 12 |
| 13–19 | స్తుతిని రచించుటలో తమకు శక్తి లేదనుచు భట్టరు వినయమును ప్రదర్శించుట | 7 |
| 20–24 | కావేరీ నది వర్ణన | 5 |
| 25–32 | శ్రీరంగద్వీపము, ఉద్యానవనములు, శ్రీరంగనగరముల వర్ణన, నగరపాలకుల వందనము | 8 |
| 33–62 | శ్రీరంగములోని మండపము, వేయికాళ్ల మండపము, చంద్రపుష్కరిణి, పున్నాగవృక్షముల వర్ణన, పరమపదనాథుని సన్నిధిలోని పదినుంది ఆళ్వార్లను, శ్రీరంగవిమానమును, విష్వక్సేనులను, సూత్రవతిని, ద్వారపాలకులను, గరుడుని, తత్పుత్రులను, పంచాయుధములను, సుదర్శనమును, హనుమద్విభీషణులను, వేత్రవరమును, ఆమోదస్తంభములను, చామరగ్రాహిణులను ఆశ్రయించుట | 30 |
| 63–76 | శ్రీరంగనాథుని ఉత్సవమూర్తి వర్ణన | 14 |
| 77–127 | మూలమూర్తి వర్ణన | 51 |

## (6) శ్రీరంగరాజస్తవము – ద్వయమంత్ర వివరణము

నమ్మాళ్వార్లచే ప్రణీతమైన తిరువాయ్ మొళి తనియన్ (ప్రార్థనా పాశురము) ను అనుగ్రహించు భట్టరు "వాన్ తికఴుమ్ శోలై మదిళరఙ్గర్ వణ్ పుకఴ్ మేల్ ఆన్ఱ తమిఴ్ మఱైకళ్ ఆయిరముమ్ " (ఆకాశమును తాకు ఉద్యానవనాలను, ప్రాకారాలను కలిగిన శ్రీరంగంలో ఉండే శ్రీరంగనాథుని ఉదారమైన కల్యాణ గుణాలను ఉద్దేశించి అనుగ్రహింపబడిన వేదరూపాలైన పాశురాలు వేయి) అనుచు ఆ ప్రబంధము శ్రీరంగనాథుని గూర్చి రచింపబడినదనిరి. తిరువాయ్ మొళి ప్రబంధము ద్వయమంత్రమును వివరించుచున్నదని పూర్వాచార్యుల అందటి అభిప్రాయము. మొదటి మూడు శతకములలో ఉత్తరఖండార్థము, పిమ్మట మూడు శతకములలో పూర్వ ఖండార్థమును వివరింపబడినదని సంప్రదాయము, శ్రీరంగనాథుని స్తుతించు ఈ స్తోత్రమును భట్టరు ద్వయమంత్ర వివరణరూపముగా రచించిరని అభిజ్ఞులగు ఆచార్యులు, వ్యాఖ్యాతలును అభిప్రాయపడిరి. దీని వివరణము శ్రీవేంకటాచార్యవ్యాఖ్యానమున తెలుపబడినది.

భట్టరు అష్టశ్లోకిలో "నేతృత్వమ్" అను శ్లోకమున ద్వయమంత్రమున పది జ్ఞాతవ్యార్థములు కలవని పల్కిరి. ఆ అర్థములు శ్రీరంగరాజస్తవమున వివరింపబడుటను ఈ క్రింది విధముగా భావించవచ్చును.

### పూర్వశతకము– పూర్వఖండార్థము :–

(1) శ్రీ :– నేతృత్వమ్– అనగా, లక్ష్మీపురుషకారము. ఈ అర్థము "యద్భ్రూవిభ్రమ భేదతః ఈశేశితవ్యమ్", "స్తనస్తబకచంచలః శ్రీరంగరాజభృంగః" ఇత్యాదులచే సూచింపబడినది.

(2) మత్ :– (దివ్యదంపతుల) నిత్యయోగమ్– "లక్ష్మీపదలాక్షైకలక్షణమ్", "శ్రీస్తనకస్తూరీమకరీముద్రితోరసః" ఇత్యాదులచే ఈ అర్థము తెలుపబడినది.

(3) నారాయణ :- సముచితగుణజాతమ్ – అనగా, వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, జ్ఞానశక్త్యాదులు - 87, 88, 90 మొదలగు శ్లోకములలో ఈ గుణములు వివరింపబడినవి.

(4) చరణౌ :- తనుఖ్యాపనమ్ – దివ్యమంగళ విగ్రహప్రకాశనము– పూర్వశతకములోని 63న శ్లోకమునుండి - 123వ శ్లోకము వరకు కల శ్లోకములలో ఈ అర్థము తెలుపబడినది.

(5) శరణం :- ఉపాయం– "పాదపద్మౌ మనవై నవై చ", "పాదపంకజయుగం వందామహే" "శ్రీరంగేందోః పదకిసలయే వందే" అనుటచే సూచింపబడినది.

(6) ప్రపద్యే :- కర్తవ్యభాగమ్ – అనగా, చేతనుని అధ్యవసాయము– "శ్రీరంగిణః పదం న మంగళం వహతు", "శ్రీరంగేశయ మాశ్రయే" ఇత్యాదులచే ఈ అర్థము తెలుపబడినది.

## ఉత్తరశతకము – ఉత్తరఖండార్థము :-

(1) శ్రీమతే:- ప్రాప్యం మిథునపరమ్ – "లక్ష్మీనేత్రా త్వయా', "స్వముద్దిశ్య శ్రీమాన్ –––ఇతి వదతి వాగౌపనిషదీ", "లక్ష్మ్యా సహ త్వాం పశ్యేమ" ఇత్యాదులయందు ఈ అర్థము సూచింపబడినది.

(2) నారాయణ:- స్వామిత్వమ్ (తన్మూలకములగు వాత్సల్య సౌశీల్య సౌలభ్యాదులు) - అవతారములను వర్ణించు శ్లోకములలో(45 నుండి 73వ శ్లోకము వరకు) ఈ అర్థము తెలుపబడినది

(3) ఆయ (చతుర్థీవిభక్తి) - ప్రార్థనం (కైంకర్యప్రార్థన) "త్వాం శరద శ్శతం పశ్యేమ", "శ్రీరంగనాథం త ముపాసిషీయ", "స సన్ యజే జ్ఞానమయైః ముఖైః", "పరస్మై బ్రహ్మణే ఏనం ప్రత్యంచం యునజై" ఇత్యాదులచే ఈ అర్థము సూచింపబడినది.

(4) నమః – ప్రబలతరవిరోధిప్రహాణమ్:– (ప్రాప్యవిరోధినిరసనము) "అసౌ దుఃఖం సుఖయతి ఇతి మాం దయస్వ", "భృశనిమ్న మిమం జన మున్నమయ" ఇత్యాదులచే ఈ అర్థము తెలుపబడినది.

ఈ విధముగా ఈ స్తోత్రములోని ఆ యా పదప్రయోగములలో ద్వయమంత్రములోని అర్థము ప్రకాశింపచేయబడినది – అని భావించవచ్చును.

## (7) శ్రీరంగరాజస్తవము – అర్థపంచకవివరణము

భట్టరు తిరువాయ్ దివ్య ప్రబంధమునకు తనియన్ గా రచించిన "మిక్క ఇఱై నిలైయుమ్ మెయ్యా ముయర్ నిలైయుమ్" అను పాశురమున ఆ ప్రబంధమున అర్థపంచక వివరణము ప్రమేయ మనిరి. శ్రీరంగనాథుని గూర్చి పాడబడిన తిరువాయ్ మొళి అర్థపంచకమును వివరించునట్లే, ఆ స్వామి విషయమున భట్టర్ చే రచింపబడిన ప్రస్తుతస్తవమునకూడ అర్థపంచకము ప్రతిపాదింపబడినదనుటలో ఏ సందేహము లేదు. ఆ విషయ మిదట స్థాలీపులాకముగా తెలుపబడుచున్నది.

## (A) స్వస్వరూపము :– (జీవాత్మస్వరూపము)

(a) "వపుః అవయవితయా ఇదంకుర్వాణైః బహిష్కరణైః నిరవయవకః అహంకారోర్హః కరణాతిగః పుమాన్ స్ఫురతి హి" (4వ శ్లో. ఉ. శ. ) (శరీరము అవయములను కల్గినదగుటచే, "ఇది" అని వేరు చేయు బాహ్యేంద్రియములచే అవయవములు లేని " అహమ్" అను ప్రతీతికి అర్హుడగు, ఇంద్రియాతీతుడగు పురుషుడు తోచుచున్నాడు. కదా!)– అనుటచే ఆత్మదేహము కంటె వేరయినది. అణువు, బాహ్యేంద్రియములకు గోచరము కానిది– అని మొదలైన ప్రయోగములలో ఈ విషయము తెలియజేయబడినది

(b) "అహ మిద మభివేద్మీతి ఆత్మవిత్త్యోః విభేదే స్ఫురతి" (10వశ్లో) ("నేను దీనిని తెలిసికొనుచున్నాను" అని ఆత్మ, జ్ఞానముల భేదము తోచుచుండగా) అని మొదలైన సూక్తులలో ఆత్మ అనునది జ్ఞానము కన్న విలక్షణమయినది – అని స్ఫురించుచున్నది

(c) "ప్రళయసీమని అచిదవిశేషితాన్"(41వ శ్లో)- (ప్రళయమున అచిత్తు కంటే విశేషము లేని పలు జీవులను) - అనుటడే ఆత్మల అనేకత్వము తెలుపబడినది

(d) "యస్యాస్మి పత్యుః" (81వ శ్లో) (ఏ స్వామికి దాసుడనైతినో) అనుటవలన జీవుని అనన్యార్హశేషత్వము తెలియజేయబడినది.

(e) "రంగనిధే! త్వమేవ సాహి"(88వ శ్లో) (శ్రీరంగనాథా! నీవే రక్షింపుము) అనుటచే జీవుని అనన్యశరణత్వము తెలుపబడినది.

(f) "పరస్మై బ్రహ్మణే మహసే అస్మై తదర్థం ప్రత్యంచం మామ్ ఏనం యునజై" (82వ. శ్లో. ) (పరబ్రహ్మయు, తేజోరూపియు అగు శ్రీరంగనాథుని కొఱకు ప్రత్యగాత్మ అగు ఈ నన్ను కూర్చుకొనుచున్నాను) అనుటచే జీవుని అనన్యభోగ్యత్వము చెప్పబడినది.

(g) "జ్ఞానక్రియాభజనసంపదకించనోహమ్" (89వ శ్లో) (జ్ఞానకర్మభక్తిసంపదలను ఏమియు లేని నేను) అనుటవలన శరణాగతునకు ఉండవలసిన ఆకించన్యము చెప్పబడినది.

(h) "స్వభావదాస్యేన చ" (81 వ శ్లో) (సహజదాస్యముచే) అనుటచే ఆత్మల సహజదాస్యము తెలుపబడినది.

(i) "తే శేష శేషు ప్రపంచః వపుః" (24వ శ్లో) ('ఈ సమస్త ప్రపంచము నీకు శేషము, శరీరమును") అనుటచే ఆత్మలు భగవానునకు శరీరము – అని చెప్పబడినది.

(j) "అహృతసహజదాస్యాః" అను శ్లోకమున జీవుల నిత్య–ముక్త–ముముక్షు (బద్ధ) భేదము చెప్పబడినది.

ఇట్లు పలు విధములుగ జీవస్వరూపము ఈ స్తోత్రములో వివరింపబడినది.

## (B) పరస్వరూపము :– (పరమాత్మస్వరూపము)

(a) "స్వ ముద్దిశ్య శ్రీమాన్' (87వశ్లో) "లక్ష్మీపదలాక్షైకలక్షణమ్", "శ్రీస్తనకస్తూరి మకరీముద్రితోరసః" – ఇత్యాదులచే శ్రియఃపతిత్వము,

(b) పూర్వోత్తర శతకములలోని పలు శ్లోకములు భగవానుని సమస్తకల్యాణగుణాకరత్వము,

(c) "త్వాం పుండరీకేక్షణ మామనంతి"అనుటచే పుండరీకాక్షత్వము,

(d) "శ్రీరంగకమ్రః కలభమ్" అనుటచే నిరంకుశస్వాతంత్ర్యము (కలభసామ్యముచే),

(e) "ఉపాయోపేయత్వే తదిహ తత్త్వమ్", "త్వయి సతి పురుషార్థే" ఇత్యాదులచే ఉపాయత్వము, ఉపేయత్వమును,

(f) "ఆత్మాస్య గంతుః పరితస్థుషశ్చ" (స్థావరజంగమములకు భగవానుడు ఆత్మ)– అనుటచే జగచ్ఛరీరకత్వము,

(g) " ప్రళయసమయసుప్తం –– క్రీడసి శ్రీసమక్షమ్" అను శ్లోకమున సృష్టి స్థితి లయ కారకత్వము

(h) "ఆర్తిం తితీర్షు రథ రంగపతే! ధనాయన్"– అను శ్లోకమున చతుర్విధపురుషార్థ –ప్రదాయకత్వము,

(1) "రత్నమివ" (27), "మహసే" (82) అనుటచే స్వయంప్రకాశకత్వమును తెలుపబడినవి.

(j) పరత్వాదిపంచకము :–

> (1) "యద్విష్ణోః పదమ్" (పూ. శ. 26), "శ్రీమద్వ్యోమ న సీమ వాఙ్మనసయోః" అను మొదలైన చోట్ల పర రూపము,
>
> (2) "షాడ్గుణ్యాద్వాసుదేవః" (ఉ. శ 39)– అను మొదలైన ప్రయోగములలో వ్యూహరూపము,
>
> (3) "స్థిత్యుత్పత్తిప్రవృత్తిగ్రసననియమనవ్యాపనైః రాత్మన స్తే" అను మొదలయిన ప్రయోగములలో– అంతర్యామిత్వము,
>
> (4) ఉత్తరశతకములోని 60వ శ్లోకమునుండి 73వ శ్లోకము వరకు అవతారములు (విభవము),

(5) "ఆర్చ్యః సర్వసహిష్ణుః" (ఉ. శ. 74) అర్చారూపములు తెలుపబడినవి.

ఈ విధముగా పరస్వరూపమునకు సంబంధించిన అనేక విషయములు ఇందు ప్రతిపాదింపబడినవి.

(C) ఉపాయస్వరూపము :- "తవ భరోఽహ మకారిషి ధార్మికైః శరణ మిత్యపి వాచ ముదైరిరమ్" (102) (నేను ధార్మికులగు ఆచార్యులచే నీకు రక్షింపబడవలసినవాడనుగా చేయబడితిని, శరణమను మాటనుకూడ పలికితిని) ఇత్యాదులచే ఆచార్యముఖముగా సమాశ్రయణము, "రంగేశ్వర త్వాం శరణం ప్రపద్యే" ఇత్యాదులనే శరణవరణము తెలుపబడినవి.

(D) ఉపేయస్వరూపము :- "యోహ మస్మి స సన్ యజే జ్ఞానమయైః మఖైః", "ప్రత్యంచ మేనం యునజై పరస్మై", "లక్ష్మ్యా సహ త్వాం శరదశ్శతం పశ్యేమ" ఇత్యాదులచే భగవానునకు చేయు నిత్యకైంకర్యము ఉపేయమని తెలుపబడినది.

(E) విరోధిస్వరూపము :-

(a) దేహాత్మాభిమానస్వస్వాతంత్ర్యరూపస్వరూపవిరోధి :- "జనమఖిల మహంయుః" (90), "అహం భవామి" (101) అనుటచే తెలుపబడినది.

(b) "త్వా మపి విస్రంభవివేకరేకాత్ అపాస్య" అనుటచే అర్చావతారమున అశక్తియోగప్రతిపత్తి అనబడు పరత్వవిరోధి సూచింపబడినది. "ప్రకుపితభుజగఫణానా మివ విషయాణా మహం ఛాయామ్––" అనుటవలన పురుషాంతరములలోని ఇచ్ఛ అను పురుషార్థవిరోధి తెలుపబడినది.

(d) "మయి గుణపరమాణుాదంతచింతానభిజ్ఞే" (97) ఇత్యాదులచే విరోధిబాహుళ్యము అను ఉపాయవిరోధి,

(e) "అతిక్రామన్ ఆజ్ఞాం తవ విధినిషేధేషు, భవతేపి భక్తాయ అభిద్రుహ్యన్"(9) ఇత్యాదులచే భగవద్భాగవతాపచారములనబడు ప్రాప్తి (అనుభవ) విరోధియు సూచింపబడినవి.

ఈళ సూక్తులు అన్నియు వివరణ సాపేక్షములువీటి వివరణ ఆయా లోకాల వ్యాఖ్యలో తెలుపబడును.

ఇట్లు శ్రీరంగరాజస్తమున అర్థపంచక ప్రతిపాదనము చేయబడినది.

## (8) శ్రీరంగనాథుని పలు విధములుగా రూపణము చేయుట

భట్టరు శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుని పలు వస్తువులతో రూపించుచు అనేక విధములుగా రూపణము చేసిరి. ఇవి అన్నియు చాలవరకు ఆళ్వార్ల దివ్యసూక్తులను అనుసరించియే చేయబడినవి – అను విషయము వరివస్యా వ్యాఖ్యానములో ఆయా శ్లోకముల వివరణలో నిరూపింపబడినది. భట్టరు చేసిన రూపణముల వివరము ఈ క్రింద స్థాలీపులాకంగా చూపబడుచున్నది.

(1) చంద్రుడు –11, 14 50 వ శ్లో. (పూ. శ)
(2) భృంగము–105శ్లో. (పూ. శ)
(3) కలభము (గున్న ఏనుగు) 16 వ శ్లో. (పూ. శ)
(4) ధనము – 765 వ శ్లో. (పూ. శ)
(5) వషట్కృతము – 99 వ. శ్లో. (. ఉ. శ. )
(6) తటాకము– 63, 64, 65 వ శ్లో. (పూ. శ)
(7) కాందిశీకుడు. –58వ. శ్లో. (పూ. శ)
(8) కల్పవృక్షము– 76 వ శ్లో. (పూ. శ)
(9) కామధేనువు– 76 వ. శ్లో. (పూ. శ)
(10)వర్తకుడు– 88 వ శ్లో. 88శ్లో. (ఉ. శ. )
(11) క్ష్మాతలము–76 వ. శ్లో. (పూ. శ)
(12) రత్నాపణము– 36 వ. శ్లో. ((ఉ. శ)
(13) సముద్రము– 80, 102, 117 వ. శ్లో. (ఉ. శ. )
(14) ఊర్ణనాభి– 31 వ శ్లో. (ఉ. శ)
(15) కుంజరము –80, 118 వ శ్లో. (ఉ. శ)

(16) అర్ణవతర్ణకము –81, 54 వ. శ్లో. (ఉ. శ)
(17) నందనవనము– 84 వ. శ్లో. (పూ. శ)
(18) మరకతమణి–86 వ. శ్లో. (పూ. శ)
(19) కాలమేఘము–82 వ శ్లో. (పూ. శ)
(20) జనని– 45 వ. శ్లో. (ఉ. శ)
(21) రత్నము– 27 వ. శ్లో. (ఉ. శ. )
(22) కస్తూరి– 33 వ. శ్లో. (ఉ. శ)
(23) శిఖి– 44 వ. శ్లో. (ఉ. శ)
(24) సుహృత్– 47 వ. శ్లో. (ఉ. శ)
(25) చింతామణి– 85. వ శ్లో. (పూ. శ)
(26) అమృత ప్రవాహము–75, 83 వ శ్లో. (పూ. శ)
(27) నేత్రము–75 వ శ్లో. (పూ. శ)
(28) జీవితము(అసువులు)–75వ శ్లో. (పూ. శ), 66వ శ్లో. (పూ. శ. )

ఈ స్తోత్రములోని పాఠభేదములు, అలంకారములు, ఛందస్సు, పదప్రయోగములకు సంబంధించిన విశేషములు ఆ యా శ్లోకముల వ్యాఖ్యలో వివరింపబడుటచే, పునరుక్తి అగును కనుక, అవి ఇచట మరల ప్రస్తావింపబడుటలేదు.

## (9) శ్రీరంగరాజస్తవములోని వృత్తముల వైవిధ్యము, ఔచిత్యము

శ్రీరంగరాజస్తవమునకు సంస్కృతవ్యాఖ్యానమును రచించిన శ్రీగార్గ్యరామానుజాచార్యులు తమ వ్యాఖ్యాప్రారంభమున "**నానావృత్తశ్లోకభంగ్యా ప్రవృత్తమ్**" అనుచు భట్టర్ చూపిన వృత్తవైవిధ్యమునుగూర్చి ప్రస్తుతించిరి. ఈ స్తోత్రమున ప్రయోగింపబడిన పలు వృత్తములు సందర్భోచితిని కల్గియున్నవను అంశము ఆ యా శ్లోకవ్యాఖ్యానమున వివరింపబడినది. అందుచే ఇక్కడ మరల ప్రస్తావించుటలేదు.

ప్రస్తుతము ఈ స్తోత్రములో గోచరించు మఱి కొన్ని ఛందోవిశేషములు తెలుపబడుచున్నవి.

శ్రీరంగరాజస్తవ పూర్వోత్తరశతకములలోని వృత్తములను పరిశీలించినచో, భట్టరు అన్ని విధములైన వృత్తములను– అనగా, మాత్రా, సమ, అర్ధసమ, విషను వృత్తములను ఉపయోగించినట్లు వ్యక్తమగును. మొత్తము మీద రెండు శతకములలో 41 విధములైన వివిధ వృత్తములు ఉపయోగింపబడినవి. వీనిలో కొన్ని అపూర్వములైనవి. ఉత్తరశతకములోని 60వ, 61వ శ్లోకములలో బేసిపాదములు రుక్మవతీ వృత్తమున (అనగా, భ, మ, స, గ అను గణములతో), సరి పాదములలో మణిగణకిరణవృత్తమున (అనగా న, న, న, న, స అను గణములతో) రచింపబడినవి. అనగా, ఇది అర్ధసమవృత్తభేదము. ఈ వృత్తము వృత్తరత్నాకరాదిగ్రంథములలో కన్పించుటలేదు. ఉత్తర శతకములోని 50వ శ్లోకము "య, భ, త, గ, గ" అను గణములతో కూడిన సమవృత్తభేదము. ఇదియు (నాకు లభించిన)ఛందోగ్రంథములలో కానవచ్చుటలేదు. (మరి వేరు గ్రంథములలో ఎక్కడైనా ఉన్నవేమో తెలియదు) ఇట్లే, పుష్పితాగ్ర, మాలభారిణివంటి ముఱి కొన్ని సమవృత్తభేదములును కలవు. ఉత్తరశతకములోని 34వ శ్లోకము "ఉద్గత" అను విషమవృత్తజాతికి చెందినది. ఈ వృత్తమున మొదటి పాదమున "స, జ, స, ల" అను గణములు, రెండవ పాదమున "న, స, జ, గ' అను గణములు, మూడవ పాదమున "భ, న, జ, ల గ" అను గణములు, నాల్గవ పాదమున "స, జ, స, జ, గ" అను గణములు ఉండును. పూర్వశతకములోని 86వ శ్లోకము "మణిగణకిరణ" మను వృత్తభేదము. ఇందు ఈ వృత్తము పేరు ముద్రాలంకారపద్ధతిలో సూచింపబడినది. అరుదుగా కన్పించు మత్త, ద్రుత మధ్య, వియోగిని, కుసుమలతా వేల్లిత, కోకిలకము ప్రమాణిక, రుచిర, ప్రమితాక్షర వంటి వృత్తములును ఈ స్తోత్రమున ప్రయోగింపబడినవి. , వాణి, బాల, ఆర్ద్ర, కీర్తి, బుద్ధి, రాము, మాల వంటి ఉపజాతివిశేషములు, మాత్రా ఛందస్సునకు చెందిన ఆర్యావృత్తములును కలవు.

ఇట్లు శ్రీరంగరాజస్తవమున భట్టరు ప్రదర్శించిన ఛందోవిషయకవైశిష్ట్యము, వైవిధ్యము, ఔచిత్యము అనితరసాధారణమైనదవి, ఆశ్చర్యకరమైనవి, సహృదయ హృదయాకవర్జకమైనవియు.

ప్రస్తుతము, ఈ స్తవమున ప్రయోగింపబడిన వృత్తముల వివరములు ఈ క్రింద చూపబడుచున్నవి.

(1) ఆర్య– 59, 61, 101, 122. 92, 100. (ఉ. శ. )

(2) అనుష్టుభ్ –1నుండి 12 వరకు– (పూ. శ. ), 99 – (ఉ. శ)

(3) ప్రమాణిక–91 (పూ. శ)

(4) మంజుభాషిణి – 13, 14, 94 (పూ. శ)

(5) వసంతతిలక (ఉద్ధర్షిణి, సింహోన్నత) – 15, 17, 18, 34, 37, 42, 48, 49, 50, 63, 120– (పూ. శ. )1, 27, 42, 51, 71, 83, 89 (ఉ. శ. )

(6) ఇంద్రవజ్ర– 16, 35, 38, 123(పూ. శ. ), 2, 79, 80, 82, 93, 95, 105 -(ఉ. శ. ).

(7) శార్దూలము–20, 21, 22, 70, 72, 74, 76, 108, 112, 124, 125(పూ. శ. ), 12, 17, 21, 23, 38, 43, 55, 70, 72, 74, 75, 76. (ఉ. శ. ).

(8) హరిణి–23, 39, 52, 79, 103, 104, 106, 115-(పూ. శ. ), 63, 64, 69, 77 (ఉ. శ. ).

(9) మాలిని– 24, 25, 28, 33, 45, 47, 53, 64, 68, 80, 102, 111. (పూ. శ. ), . 6, 10, 13, 28, 44, 47, 48, 86, 90, 97 - (ఉ. శ. ).

(10) ప్రహర్షిణి– 26, 27, 81(పూ. శ. ), 3, 2, 59. (ఉ. శ. )

(11) పుష్పితాగ్ర–29, 30, 31, 32, 62, 118-(పూ. శ. )25 49, 54- (ఉ. శ. )

(12) తోటకము–- 36. పూ. శ. ), 104(ఉ. శ. , ).

(13) స్వాగత –46, 8(పూ. శ). 53 - (ఉ. శ. )

(14) రుక్మవతి–51-. (పూ. శ. )

(15) శిఖరిణి– 44, 90, 92, 99, 105, 109, 110, 116– (పూ. శ. )7, 20, 37, 62, 65, 66, 68, 87, 91, 103–(ఉ. శ. )

(16) ఉపజాతి –40, 41, 43, 58(పూ. శ. ), 78, 81, 101. (ఉ. శ. )

(17) రథోద్ధత– 54– (పూ. శ. )

(18) స్రగ్విణి– 55(ఉ. శ. )

(19) శాలిని –56, 60, 121. (పూ. శ. ), 85, 94(ఉ. శ. )

(20) మేఘవితానము –57(పూ. శ. )

(21) స్రగ్ధర –19, 75 (పూ. శ. )–2. 4. 14, 15, 18, 19, 24, 26, 30, 35, 39, 56, 58, 67(ఉ. శ. )

(22) నర్క్యుటకము–, 77, 78, 107(పూ. శ. ), 5. 5. , 41 (ఉ. శ. )

(23) మాలభారిణి– 84, 98, 100. (పూ. శ. ), 16, 88(ఉ. శ. )

(24) మందాక్రాంత–89, 113, 127–(పూ. శ. ) 8. 8, 31, 45, 46(ఉ. శ. ).

(25) ప్రముదితవదన – 93, 97–(పూ. శ. )

(26) ప్రమితాక్షర –95, 96(పూ. శ. )

(27) రుచిర –114 (పూ. శ. )– 98 (ఉ. శ. ).

(28) మత్తమయూరము– 117(పూ. శ. )

(29) భుజంగప్రయాతము – 119. ((పూ. శ. ) 9, 52, 96(ఉ. శ. ).

(30) మణిగణకిరణము– 86 (పూ. శ. )

(31) పృథ్వి – 126 (పూ. శ. ) 25, 36, 57–(ఉ. శ. )

(32) కుసుమలతా వేల్లిత –11. (ఉ. శ. )

(33) ద్రుతవిలంబితము–32, 102 – (ఉ. శ. ).

(34) కలహంస–33–. (ఉ. శ. )

(35) ఉద్గత–34 (ఉ. శ. )

(36) మత్త–40(ఉ. శ. )

(37) ద్రుతమధ్య–73. (ఉ. శ. )

(38) భ్రమరవిలసితము–84(ఉ. శ. )
(39) లలిత (వియోగిని, సుందరి)–29. (ఉ. శ. )
(40) అర్ధసమవృత్తము – (రుక్మవతి– మణిగణకిరణము)–60, 61(ఉ. శ. ).
(41) అనామకము (?) 50 (ఉ. శ. )

ఇంతటి వృత్త వైవిధ్యమును కలిగిన స్తోత్రము మన సంప్రదాయ సాహిత్యములో వేరొకటి లేదనియే చెప్పవలెను.

## (10) రంగరాజశబ్దనిర్వచనము

"రంగతి ఇతి రంగం, రగి–గతా" అను వ్యుత్పత్తిని కల్గిన రంగశబ్దము అమరకోశము, మేదినీ మొదలగు నిఘంటువులలో సులభముగా "కఱగు తగరము" అను లోహమును, యుద్ధరంగమును, నాట్యరంగమును బోధించు పదముగా చూపబడినది. " రంగరాజ" అను సమాసమున రంగశబ్దమునకు పై అర్థములలో మొదటి రెండు అప్రస్తుతములు. మూడవది అగు నాట్యరంగమను అర్థము మాత్రము ఒక విధముగ అన్వయింప వీలున్నది. ఇదియే కాక, మఱికొన్ని విధములుగా కూడా ఈ సమాసమునకు అర్థమును చెప్పవీలున్నది.

(1) "**రంగ్యతే గమ్యతే భక్తిః ప్రాప్యత్వేన, ప్రాపకత్వేన చ ఇతి రంగః**" – అను వ్యుత్పత్తివలన, భక్తులచే ఉపాయముగా, ఉపేయముగా ఆరాధింపబడువాడనియు, "**స్వయం భక్తం ప్రతి రంగతి – గచ్ఛతి ఇతి రంగః**" అనుటచే, స్వయముగా భక్తులవద్దకు తానే వెడలువాడు అనియు రెండు విధములుగా రంగశబ్దమునకు అర్థములను చెప్పవచ్చును. వీనిలో, మొదటి వివరణము భగవానుని ప్రాప్య ప్రాపకత్వరూపమగు అసాధారణ స్వరూపమును, రెండవ వివరణము భగవానునకు భక్తుని పట్ల గల ఆదరాతిశయమును తెలుపుచున్నవి. ఈ రెండు వివరణములు శ్రీరంగనాథుని విషయమున అర్థవంతములే. మహనీయులగు ఆళ్వార్లు, పూర్వాచార్యులు అందఱును అర్చావతారమూలకందమగు శ్రీరంగనాథుని ప్రాప్యప్రాపకముగా తలచిరి. నమ్మాళ్వార్ల సహస్రగీతినిగూర్చి "**వాన్ తికழ్మ్ శోలై మదిళరఙ్గర్ వణ్ పుకழ**

**మేల్ ఆన్ట తమిళ్ మఱైకళ్ ఆయిరముమ్**" (ఆకాశమును తాకే తోటలను, ప్రాకారములను కలిగిన శ్రీరంగములో నిత్యనివాసం చేసే శ్రీరంగనాథుని ఉదారమైన కల్యాణ గుణాలను గూర్చిన పాడిన వేదరూపాలైన పాశురాలు) అని భట్టరే సెలవిచ్చిరి కదా! పరత్వాదిపంచకమును శ్రీరంగనాథునిగూర్చియేనని మన పూర్వాచార్యులు నిర్వహించినట్లు కీర్తిమూర్తులు, వాగమృతవర్షి, ఉ. వే. శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్యస్వామివారు తమ గ్రంథమగు "**అరుళిచ్చెయల్ అనుభవమ్**" లో తెలిపిరి. భక్తజన సంరక్షణార్థము పరమపదనాథుడగు భగవానుడు శ్రీరంగనాథుని రూపమున కావేరీమధ్యదేశమగు శ్రీరంగక్షేత్రమునకు స్వయముగా వచ్చెనని పురాణ ప్రసిద్ధి కలదు. కావున "**రంగ**" శబ్దము భగవానుని బోధించును. ఇట్లు "**రంగ శ్చా సా రాజా చ రంగరాజః**" – అనుటచే శ్రీరంగనాథుని రూపములోనున్న ప్రభువు – అని రంగరాజశబ్ద వివరణము.

(2) రంగశబ్దమునకు "**రంగ్యతే గమ్యతే భగవతా ఇతి రంగమ్**" అను వ్యుత్పత్తిని గ్రహించిన, భగవానుడు ఆదరముతో చేరిన క్షేత్రము కావున, రంగమను అర్థము వచ్చును. ఈ అర్థమున రంగశబ్దముచే క్షేత్రము నిర్దేశింపబడుచున్నది. "**రంగస్య శ్రీరంగక్షేత్రస్య రాజా శ్రీరంగరాజః**" అని రంగరాజశబ్ద వివరణమును ఈ సందర్భమున చెప్పనగును. అట్లే, "**రంగ్యతే గమ్యతే ప్రాప్యతయా నిత్యముక్తముముక్షుభిః ఇతి రంగమ్**" నిత్యులు, ముక్తులు, ముముక్షువులు ప్రాప్యముగా పొందుచున్నారు కావున, రంగము – <అనియు చెప్పవచ్చును. ఈ సందర్భమున "**అహృతసహజదాస్యాః**" అను ప్రస్తుతస్తోత్రములోని శ్లోకరత్నము అనుసంధేయము.

(3) "**రజ్యంతే అస్మిన్ సర్వే సామాజికా ఇతి రంగమ్**" అనునది ఇంకొక వ్యుత్పత్తి. దీనినిబట్టి రంగశబ్దమునకు నాట్యరంగమను అర్థమును గ్రహించినచో, "రంగస్య నాట్యరంగస్య' రాజా రంగరాజః" అని రంగరాజ శబ్దమును వివరింప వీలు కలదు.

ఈ ప్రపంచము ఒక నాటకరంగము. ఆ నాటక రంగమున పలు భంగినులతో శ్రీరంగనాథుడను నటశేఖరుడు భక్తులనెడి సామాజికులను

రంజింపచేయును. కావున, స్వామికి రంగరాజశబ్దము సార్థకము. ఇచట రాజ శబ్దమునకు "రాజా ప్రకృతిరంజనాత్" – ప్రజలను ఆనందింప చేయుచున్నాడు కనుక రాజు– అను వ్యుత్పత్తిని చెప్పనగును. భగవానుడు జగన్నాటక సూత్రధారి కదా!

భట్టరు పూర్వశతకములోని పలు శ్లోకములలో శ్రీరంగనాథుని నాయకునిగా, శ్రీరంగనాయకిని నాయికగా, భక్తులను సామాజికులుగా వర్ణించిరి. ఈ సందర్భమున **"లోకవత్తు లీలాకైవల్యమ్"** (భగవానుడు లోకాలను సృష్టించడం అనేది కేవలం లీలకోసమే) అను బ్రహ్మసూత్రమును, **"అనుశిఖిని శిఖీవ క్రీడసి శ్రీసమక్షమ్"** (మగనెమలి, ఆడు నెమలి ముందు తన పింఛమును విప్పి ఆడునట్లుగా, నీవు లక్ష్మీసన్నిధానంలో ఈ లోక సృష్టిని చేసి, ఆనందిస్తున్నావు) అను ఉత్తరశతకములోని శ్లోకమును స్మరణీయములు. దశావతారస్తోత్రమున దేశకులు **"దేవో నః శుభ మాతనోతు దశధా నిర్వర్తయన్ భూమికాం, రంగే ధామని అబ్దనిర్భరరసై రధ్యక్షితో భావుకైః"** (శ్రీరంగక్షేత్రం అనే నాట్య రంగంలో పలు విధాలుగా ఉండే అవతారాలు అనే రూపాలను ధరించి, శ్రీరంగనాథుడు అనే నటుడు, ఆ రూపాలను దర్శించి ఆనందించే భావుకులైన భక్తులచే దర్శింపబడుతున్నాడు) అని పల్కులు ఇచట ఉదాహార్యము. ఈ దశావతార స్తోత్రమునకు శ్రీఏ. వి. గోపాలాచార్య స్వామి అనుగ్రహించిన ద్రావిడ వ్యాఖ్యలో ఈ అంశము పలు సందర్భములలో వివరింపబడినది.

(4) రంగమనుటకు శ్రీరంగనాయకి యొక్క నృత్తరంగమను వేరొక రస్యమైన అర్థమును పూర్వాచార్యులు తెలిసిరి. నాయ్ చ్చియార్ తిరుమొళిలోని **"పెణ్ణాళన్ పేణుమూర్ పేరు మరఙ్గమే"** (11–9) అనునపుడు అరఙ్గమనుటకు **"పెరియపిరాట్టియార్ క్కు నృత్తస్థానమ్"** (శ్రీరంగము శ్రీరంగనాయకి నృత్తస్థానము) అని పెరియవాచ్చాన్ పిళ్లై వివరించిరి. ఈ అర్థమునకు ఉపోద్బలకముగా ప్రస్తుతశ్లోకములోని **"నమః శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమభేదతః"** అను శ్లోకార్థము అనుసంధేయము.

(5) రంగశబ్దమునకు సామాజికులను అర్థమును కలదు. "ఆహో, !రాగబద్ధచిత్తవృత్తిః అలిఖిత ఇవ సర్వతో రంగః" (అభిజ్ఞానే- ప్రథమాంకే) (ఎంత ఆశ్చర్యము! సభలో ఉండే సామాజికులు అందరూ రాగముచేత ఆకర్షింపబడిన మనసులను కలిగినవారై, చిత్తరువులో లిఖించిన రూపములవలే నిశ్చేష్టులుగా ఉన్నారు) ఇత్యాది ప్రయోగములు ఉదాహరణములు. కావున "రంగస్య భక్తజనరూపసామాజికరంగస్య రాజా రంగరాజః"– భక్తులు అను సామాజికులను సంతోషింపచేయువాడు, కావున రంగరాజ శబ్దము స్వామికి సార్థకము.

(6) **"క్షీరాబ్ధేః మణ్డలాద్భానోః యోగినాం హృదయాదపి,**
**రతిం గతో హరి స్తస్మాత్ రంగ మిత్యభిధీయతే"**

(పాలసముద్రములో కంటే, సూర్యమండలములో కంటే, యోగుల హృదయాలలో కంటే, శ్రీరంగములో భగవానుడు ఎక్కువ ఆసక్తిని కలిగి ఉన్నందున, ఆ క్షేత్రము రంగమని చెప్పబడుతున్నది) అను వేరొక తాంత్రికమైన వ్యుత్పత్తి శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో చూపబడినది. ఈ వివరణమువలన, శ్రీరంగక్షేత్రముయొక్క భోగ్యతాతిశయము, ఆ క్షేత్రముపట్ల భగవానునకు గల ఆదరమును వ్యక్తమగుచున్నవి. ఈ అంశమును "స్ఫురితశఫర –– రంగారమరమ్యస్థలాని. క్రియాసుః" (28) అను శ్లోకమున భట్టరు సూచించిరి. అట్టి శ్రీరంగమున ప్రకాశించువాడు – అను అర్థము రంగరాజపదము వలన కల్గును. "రతి మవిరతి రంగారామ రమ్యస్థలాని"(28) అను లోకమున భట్టరు దీనిని సూచించిరి. అట్టి శ్రీరంగమున ప్రకాశించువాడు – అను అర్థము రంగరాజ పదము వలన కలుగును.

(7) రంగశబ్దము ద్రావిడభాషలో'అరంగమును రూపమును పొందును. అరంగ మనుటకు ఆ భాషలో రెండు నదుల మధ్య గల దీవి– అని అర్థము. "**కావేరీమధ్యదేశే**" అని, "**మధ్యేకావేరి, స్ఫురతి**" అనియు శ్రీరంగక్షేత్రము ఉభయకావేరుల నడుమన గల అంతరీపము కావున, అరంగశబ్దమునకు శ్రీరంగద్వీపము – అని అర్థము. ఆ ద్వీపమున "**పిశితదృశా మపి పురః చకాస్తి**"

(బాహ్య నేత్రాల ముందుకూడా గోచరిస్తున్నాడు) అనునట్లు అందటికిని దర్శింప వీలగునట్లు శ్రీరంగమున ప్రకాశించువాడు, కావున. రంగరాజశబ్దము స్వామి విషయమున అర్థవంతము.

ఇట్లు ఇచట చూపిన వివరణములన్నియు శ్రీరంగరాజస్తవమున కవిచే సూచింపబడినవే.

శ్రీరంగరాజస్తవపదమునకు **"శ్రీ శ్చ రంగరాజశ్చ శ్రీరంగరాజౌ, తయోః స్తవః శ్రీరంగరాజస్తవః"** అను వ్యుత్పత్తిని చెప్పిన, శ్రీరంగనాయకిని, శ్రీరంగనాథుని స్తుతించు స్తోత్రము – అను అర్థము వచ్చును. ప్రస్తుత స్తుతి ప్రధానముగా శ్రీరంగనాథునిగూర్చియే అయినను, స్వామియొక్క ఉత్కర్షను వర్ణించుట శ్రీదేవి గొప్పతనమును కూడా వర్ణించినట్లే అగును. కావున, ప్రస్తుత స్తోత్రము దివ్యదంపతుల స్తోత్రమనుటలో విప్రతిపత్తి లేదు. అంతియేకాక, **"లక్ష్మీపదలాక్షైక లక్షణమ్"**, **"లక్ష్మీకల్పలతోత్తుంగ స్తనస్తబకచండలః"** ఇత్యాదిగా లక్ష్మీకీర్తనముకూడా ఇందు కాననగును. లేక, శ్రీశబ్దము మంగళార్థకముగా ప్రయోగింబడినదనియు చెప్పవచ్చును. ఇట్టి అన్వయమును శ్రీరామాయణాది నామముల నిర్వచనమున అభిజ్ఞులగు ఆచార్యులు చూపుట గనునింపదగినది. ఇంకను మరి కొన్ని విశేషములను యతిరాజవింశతిలోని "శ్రీరంగరాజ" అను రెండవ శ్లోకమునకు పిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానమున అనుసంధింపదగినవి.

## (11) శ్రీరంగరాజస్తవ పూర్వశతకములోని శ్లోకసంఖ్య

శ్రీరంగరాజస్తవము– పూర్వశతకములోని శ్లోకసంఖ్య పలు కోశములలో 127గా కనుపించుచున్నను, కొన్ని వ్యాఖ్యానప్రతులలో వ్యత్యాసము కనుపించుచున్నది. శ్రీవేంకటాచార్యకృత సంస్కృతవ్యాఖ్యలో **"ఆలోకా హృదయాలవః"** అను 72వ శ్లోకము కొన్ని ప్రతులలో కానవచ్చుట లేదని (**"అయం శ్లోకః కేషుచిత్ కోశేషు న దృశ్యతే"**) అని తెలుపబడినది. దానికి తగినట్లు, శ్రీగార్గ్యరామానుజాచార్య వ్యాఖ్యలో ఈ శ్లోకము లేదు. అంతేకాక, **"ఆర్తాపాశ్రయ"** మను 76వ శ్లోకము, **"కటీకాంతి"** అను 119వ శ్లోకమును

అందు వ్యాఖ్యానింపబడలేదు. కావున ఆ వ్యాఖ్యను అనుసరించి శ్లోకసంఖ్య 124. "**కిరీటచూడ**" (91) అను శ్లోకము పంచచామరవృత్తమున రచింపబడినదని, ఆ శ్లోకములోని పూర్వార్థము మాత్రమే ప్రస్తుతము లభించుచున్నదని శ్రీగోపాలాచార్యవ్యాఖ్యలో తెలుపబడినది. కాని, ఈ శ్లోకము ప్రమాణికావృత్తమున రచింపబడినది. శ్లోకము అర్థమున అసంపూర్ణముగ తోచుటలేదు. వేరు వ్యాఖ్యానకారులెవ్వరు ఇట్టి అభిప్రాయమును ప్రకటింపలేదు. ఉత్తరశతకసంఖ్యలో మాత్రము భేదము కన్పించుటలేదు.

తిరువాయ్ మొళిష(1-1-5)పాశురమునకు ఈడువ్యాఖ్యానమునకు గల అరుమ్బద వివరణములో ఉట్టంకింపబడిన కూరేశుల అతిమానుష స్తవములోని "**శ్రేయః కిరంతు**" అను శ్లోకమును శ్రీరంగరాజస్తవశ్లోకముగా ఆకరమున చూపబడినది. అట్లే, (2-4-5)న పాశురమునకు ఈడువ్యాఖ్యానమునకు గల అరుమ్బదములో ప్రమాణముగా ఈయబడిన "**సూక్తం సమగ్రయతు నః**" అను శ్రీగుణరత్నకోశశ్లోకముకూడ ఆకరసూచికలో అది శ్రీరంగరాజస్తవమునకు చెందినదిగా సూచింపబడినది. ఇవి ఇట్లు చూపబడుటకు పరిష్కర్తల అనవధానత హేతువు కావచ్చును. ఇట్టి వ్యత్యాసములు మఱి కొన్ని భగవద్విషయకోశములలో అచట అవట చూపట్టుచున్నవి.

## శ్రీరంగరాజస్తవములోని శ్లోక సంఖ్యలో కల వైలక్షణ్యము

శ్రీ రంగరాజస్తవము పూర్వశతకములోని శ్లోకసంఖ్య 127గా ఉండుటకు గల కారణమును శ్రీ ఎ. వి. గోపాలాచార్యులవారు వివరించుచు, శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుడు పలు సందర్భములలో చంద్రుడుగా వర్ణింపబడుటను బట్టి ఈ సంఖ్య తారకలతో కూడిన చంద్రుని సూచించుచున్నదనిరి. ఇట్లే, మరికొన్ని విధములుగా కూడ పూర్వోత్తరశతకశ్లోకసంఖ్యలను వివరింప వీలు కలదు.

శ్రీరంగరాజస్తవము ద్వయమంత్రమునకు వివరణమని పూర్వాచార్యుల అభిప్రాయము, ఈ ద్వయమంత్రమున అక్షరముల సంఖ్య 25. ఈ సంఖ్యలోని

అంకెలను కలిపిన వచ్చు సంఖ్య 7. "**శ్రీరంగరాజస్తవ**" మను పేరున 7 అక్షరములు కలవు. శ్రీరంగరాజస్తవములోని పూర్వోత్తరశతకములలోని శ్లోకసంఖ్య 127, 105 –. ఈ సంఖ్యలను కలిపిన 232 అను సంఖ్య వచ్చును ఈ సంఖ్యలోని అంకెలను కలిపిన వచ్చు సంఖ్య 7. శ్రీరంగనాథుని ఆలయ ప్రాకారములు 7. జీవుని శరీరములోని రసము, రక్తము, మాంసము, మేధస్సు, అస్థి, స్నాయు, మజ్జ అను ధాతువుల ఆవరణములకు ఈ ఏడు ప్రాకారములు చిహ్నములని పెద్దలు అందురు. దివ్యకవి పిళ్ళై ప్పెరుమాళ్ అయ్యంగార్ తిరువరఙ్గమాలైలో శ్రీరంగములోని విమానము ఓంకారమును, ఆ విమానము సప్తప్రాకారములును కలసి అష్టాక్షరీమహామంత్రమును సూచించునని పల్కిరి. భూలోకములోని జీవులు పరమపదమును చేరవలెనన్న ఏడు లోకములను దాటిపోవలెను. అట్లే, శ్రీరంగమున శ్రీరంగనాథుని సేవింపవలెనన్న ఏడు ప్రాకారములను దాటి పోవలెను. పూర్వశతకశ్లోకసంఖ్య 127. ఈ సంఖ్యలోని అంకెలను కలిపిన వచ్చు సంఖ్య 10. ఉత్తరశతకశ్లోకసంఖ్య 105. ఈ సంఖ్యలోని అంకెలను కలిపిన వచ్చు సంఖ్య 6. ఈ రెంటిని కలిపిన 16 అను సంఖ్య అగును. మరల ఈ సంఖ్యలోని అంకెలను కలిపిన 7 అగును. ఇట్లు శ్రీరంగనాథుని స్తుతించు ప్రస్తుతస్తవములోని శ్లోకసంఖ్య కూడ పూర్వము వివరించిన విధముగా సప్తసంఖ్యను సూచించుటను గమనింపనగును.

ద్వయమంత్రములోని పదముల సంఖ్య 6. తెలియదగిన అర్థముల సంఖ్య 10. ఇవి రెండును వరుసగా ఉత్తరశతకశ్లోకసంఖ్యచే, పూర్వశతకశ్లోకసంఖ్యచే. పైన వివరించిన విధముగా సూచింపబడుచున్నవని చెప్పవచ్చును.

ద్వయమంత్రము పూర్వఖండములోని అక్షరముల సంఖ్య 15. ఈ సంఖ్యలోని అంకెలను కలిసిన వచ్చు సంఖ్య 6. అట్లే, ఉత్తరఖండములోని అక్షరముల సంఖ్య 10.

నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధమున మొదటి మూడు శతకములు ద్వయములోని ఉత్తరఖండార్థమును, తరువాత మూడు శతకములు

పూర్వఖండార్థమును వివరించుచున్నవని అభిజ్ఞులగు నమ్పిళ్ళై వ్యాఖ్యానించిరి. ఈ సూక్తిని వివరించుచు అరుమ్బదకారులు "**ఉపదేశదశాయాం ఫలం పూర్వభావి, సాధనం పశ్చాత్ భావి చ భవతి. ప్రయోజన మనుద్దిశ్య సాధనశ్రవణప్రవృత్త్యసంభవాత్ "స్వర్గకామో జ్యోతిష్టోమేన యజేత" ఇతి హ్యుచ్యతే. అతో వ్యుత్క్రమేణ వివృతమ్**" (ఉపదేశించు దశలో ఫలము ముందు చెప్పవలసి ఉన్నది. తరువాత దానికి తగిన సాధనమును ఉపదేశించవలసి ఉన్నది. ఎందుకంటే, ప్రయోజనాన్ని కోరకుండా ఎవరూ ఏ సాధనాన్ని వినాలని సిద్ధపడరు కనుక. వేదం కూడా "స్వర్గాన్ని పొందాలని కోరేవాడు జ్యోతిష్టోమయాగాన్ని చేయాలి"అని కదా చెబుతున్నది. అందువల్ల వ్యుత్క్రమంగా వివరింపబడింది) అని పల్కిరి. ఈ విధముగానే ఇచటను పై శ్లోక సంఖ్యలను గూర్చి వివరింపవచ్చును.

## (12) శ్రీరంగరాజస్తవ ప్రభావము

భట్టరుకు పిమ్మట జన్మించిన పూర్వాచార్యులపై శ్రీరంగరాజస్తవ ప్రభావము మిక్కిలి కలదను అంశము స్ఫుటముగా గోచరించుచున్నది. భట్టరు శిష్యులలో ముఖ్యులగు నంజీయర్ వారి ఆజ్ఞపై తిరువాయ్ మొళికి ఒన్బది నాయిరప్పడి అను వ్యాఖ్యను తొమ్మిది వేల గ్రంథపరిమితితో రచించిరి. అందు, అచట అచట శ్రీరంగరాజస్తవప్రభావము (ఉదా. – 3–6–3, 8–4–7 మొ॥ పాశురవ్యాఖ్యలలో) కనుపించుట విశేషము. ఇట్లు భట్టరు ప్రభావము తరువాతి కాలములోనివారి పైననే కాక, సమకాలీనులపై కూడ కలదనుటను గమనింపవచ్చును.

భట్టరు తరువాతి తరమునకు చెందినవారగు నమ్పిళ్లై అనుగ్రహించిన తిరువాయ్ మొళి ఈడు వ్యాఖ్యానమున అనేకసందర్భములలో శ్రీరంగరాజస్తవ శ్లోకములు శాబ్దికముగా, ఆర్థికముగా అనువదింపబడినవి. ఇవి వరివస్యలో అచట అచట ఉదహరింపబడినవి కూడ. అట్లే, పెరియ వాచ్చాన్ పిళ్లై రచించిన తిరువాయ్ మొళికి వ్యాఖ్య అగు ఇరుపత్తు నాలాయిరప్పడిలో [(1–5–2), (3–7–4) మొదలగుచోట్ల] మిగిలిన దివ్యప్రబంధముల వ్యాఖ్యానములలో ఈ

స్తోత్రప్రభావము చూపట్టుచున్నది. పన్నీరాయిరప్పడి అను పేరుతో తిరువాయ్ మొళికి వ్యాఖ్యానమును అళకియ మణవాళ చ్చీయర్ అను ఆచార్యులు అనుగ్రహించిరి. అందుకూడ ఈ స్తవములోని ఎన్నియో శ్లోకములు, శ్లోకభావములు స్వీకరింపబడినవి.

శతాధికగ్రంథకర్తలును, సర్వతంత్రులుగా పేరు పొందిన ఆచార్యులగు శ్రీవేదాంతదేశికులపై భట్టర్ ప్రభావము మిక్కిలి కలదనుట అపలపించుటకు సాధ్యము కాని నిజము. దేశకులు రచించిన పలు స్తోత్రములలో భట్టరు భావములు అనుసరింపబడుట, అనువదింపబడుటను గమనింపవచ్చును. వరివస్యలో యథావకాశముగా ఇది చూపబడినవి.

పూర్వశతకమునకు రస్యమైన వ్యాఖ్యానమును రచించిన, దేశిక సంప్రదాయములో ప్రసిద్ధ విద్వాంసులైన శ్రీ A. V. గోపాలాచార్యస్వామివారు ఉపోద్ఘాతమున ఈ విషయమును గూర్చి ప్రస్తావించుచు, "Sri Vedanta Desika, a great Indian Poet was a great admirer of Parasara's poetry, so much that he took pride in saying that his diction took after the manner of the son of Kuresa, which was the name of Bhatta's learned and holy father" అని పలుకుట దీనికి ప్రబల నిదర్శనము.

రహస్య గ్రంథములపై కూడ ఈ శ్లోకప్రభావము ఎంతేని కలదు. నమ్బిళ్లై అపరావతారముగా ప్రశంసింపబడు శ్రీపిళ్లైలోకాచార్యులవారు రచించిన "**అర్చిరాది**" అను రహస్యగ్రంథములోని తృతీయ ప్రకరణమున గల పరమపదనాథుని దివ్యరూపవర్ణనము శ్రీరంగరాజస్తవ శ్లోకములకు అనువాదమే. వీరి సోదరులగు అళకియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ రచించిన ఆచార్యహృదయములోని "**కారుణికనాన సర్వేశ్వరన్**", (1) అను మొదటి సూత్రమునకు ఉత్తరశతకములోని "**హర్తుం తమః**" అను మొదటి శ్లోకమే మూలము. అట్లే, శ్రీమణవాళమహామునుల రహస్యగ్రంథవ్యాఖ్యానములలో పలు తావుల భట్టరు శ్లోకములు ప్రమాణములుగా స్వీకరింపబడుట, ఎమ్బార్ జీయర్

రచించిన శ్రీరామానుజుల "తిరుమంజన కట్టియమ్" లో శ్రీరంగరాజస్తవ శ్లోకముల భావములు గ్రహింపబడుట ఈ సందర్భమున స్మరిందగినవి. ఈ విధముగానే పూర్వాచార్యులందఱిపై శ్రీరంగరాజస్తవప్రభావము మిక్కిలి స్పష్టముగా కనుపించుచున్నది. పోతన భాగవతములోని "సిరికిం జెప్పడు" అను పద్యము ఉత్తరశతకములోని "అతంత్రితచమూపతి" అను శ్లోకమునకు అనుకరణమే కదా.

**"పెరియ తిరునాళ్"** గా ప్రసిద్ధి చెందిన శ్రీరంగములోని అధ్యయనోత్సవములలోని రాపత్తు ఉత్సవములందు ధాన్యాగారసమీపమున ఆళ్వార్లు, భగవద్రామానుజులును శ్రీరంగనాథుని కొఱకు వేచియుందురు. అధ్యాపకులు, భట్టరు వంశస్థులును, శ్రీరంగరాజస్తవమును పారాయణము చేయుచుందురు. అపుడు శ్రీరంగనాథుడు అచటికి ఒయ్యారముగా విచ్చేసి, అళ్వారులను, భగవద్రామానుజులను కటాక్షించును. పిమ్మట, అధ్యాపకులు శ్రీరంగరాజస్తవ ఉత్తరశతకములోని చివరి శ్లోకమగు **"త్వం మీనపానీయనయేన"** అను శ్లోకమును పఠించుటద్వారా పారాయణను పూర్తి చేయుదురు. ఇట్లు అధ్యయనోత్సవ క్రమములో కూడ శ్రీరంగరాజస్తవ ప్రభావము కలదు.

## (13) శ్రీరంగరాజస్తవవ్యాఖ్యానములు –

(I) శ్రీవేంకటాచార్యవిరచితసంస్కృతవ్యాఖ్య:–

ఆత్రేయ గోత్రుడు, శేషాచార్యుని పౌత్రుడును, శ్రీరామానుజాచార్యుల కుమారుడగు శ్రీవేంకటాచార్యులచే రచింపబడిన ఈ వ్యాఖ్య చాలా కాలమునకు పూర్వమే, అనగా, 1879వ సంవత్సరమున శ్రీనికేతనముద్రాక్షారశాలలో తెలుగులిపిలో ముద్రింపబడినది. వ్యాఖ్యాకర్త పలు శాస్త్రములలో పాండిత్యమును కలవాడేకాక, శ్రీవైష్ణవ సిద్ధాంతమునందు, రహస్యగ్రంథములందు గాఢమైన పరిచయమును కలవాడనుట **"ఉత్ఫుల్లపంకజ"** అను శ్లోకవ్యాఖ్యానమువంటి పలు చోట్ల స్పష్టమగుమన్నది. శ్రీరంగరాజస్తవము ద్వయమంత్రమును వివరించుచున్నదను విషయము ఈ వ్యాఖ్యలో వివరముగా నిరూపింపబడినది.

శ్రీవేంకటాచార్యులు దేశికుల పాదుకాసహస్రమునకు కూడ వ్యాఖ్య రచించినట్లు "**ఋషిం జుషామహే**" అను 6వ శ్లోకమునకు గల వ్యాఖ్యలోని "**శ్రీపాదుకాసహస్రవ్యాఖ్యానామసరే ద్రావిడసంహితాయాః ప్రవాహతో నిత్యత్వ ముస్మాభి శ్చ ప్రత్యపాది**" అను వాక్యమువలన తెలియుచున్నది. కాని, ఈ వ్యాఖ్య ఇపుడు లభించుట లేదు. వరివస్యలో ఈ వ్యాఖ్యాన విశేషములు కొన్ని స్వీకరింపబడినవి.

(II) శ్రీగార్గ్య రామానుజాచార్య కృతసంస్కృతవ్యాఖ్యానము

శ్రీగార్యవంశమునకు చెందిన శ్రీరామానుజాచార్యులు రచించిన ఈ వ్యాఖ్య శ్రీవేంకటాచార్యవ్యాఖ్యవలె విస్తృతమైనది కాదు. సంగ్రహమైనది. వ్యాఖ్యానకారుడు ప్రస్తుత కరీంనగర్ జిల్లాలోని ధర్మపురినివాసి. ఈ విషయమును వ్యాఖ్యాన ప్రారంభములోని

**"పశ్యన్ గోదావరీ మగ్రే ప్రాఙ్ముఖః పద్మకాసనః,**
**నరసింహవపు ర్విష్ణు రవ్యాత్ ధర్మపురే వసన్"**

అను ప్రార్థనాశ్లోకము తెలుపుచున్నది. ఇతడు వేంకటాచార్యుల శిష్యుడను విషయముకూడ ఈ సందర్భములో తెలియుచున్నది. శ్రీరామానుజాచార్యులు, శ్రీవేంకటాచార్యులవలె. సంస్కృతభాషా ప్రావీణ్యమునే కాక, పలు గ్రంథములతో, విశిష్టాద్వైత వేదాంతముతో, శ్రీవైష్ణవ రహస్య గ్రంథ వాఙ్మయముతో, ద్రావిడప్రబంధవ్యాఖ్యానములతో చక్కని పరిచయము కలవాడని ఈ వ్యాఖ్యవలన తెలియుచున్నది. "**రంగభర్తు రపి**" అను శ్లోకవ్యాఖ్యానమున, "**ప్రతిజలధితః**" అను శ్లోకవ్యాఖ్యానమున, ఇంకను, పలు సందర్భములలో ఈ అంశము స్పష్టమగుచున్నది

ఈ వ్యాఖ్యానుసారముగా పూర్వశతకములో 124 శ్లోకములు మాత్రమే కలవు. ఇందు పలు సందర్భములలో శ్రీవేంకటాచార్యవ్యాఖ్యలోని అన్వయముల కంటె వేరయిన అన్వయములు చూపబడినవి.

ఈ వ్యాఖ్యకు గ్రంథలిపిలో గల పలు తాళపత్ర, కాగితప్రతులు మద్రాస్ ప్రాచ్యహస్తలిఖిత గ్రంథాలయములో, అడైయార్ తాళపత్ర గ్రంథాలయములో

కలవు. ఈ వ్యాఖ్య ఇంతవరకు ముద్రింపబడలేదు. ఈ వ్యాఖ్యలోని విశేషార్థములు కొన్ని వరివస్యలో గ్రహింపబడినవి.

ఈ రామానుజాచార్యులచే పంచస్తవికి కూడ వ్యాఖ్య రచింపబడినది. ఇది నాగరలిపిలో "**అనంతార్య ఇన్ స్టిట్యూట్ ఆఫ్ ఇండాలజీ**" ద్వారా ఇటీవలే ముద్రింపబడినది.

(III) శ్రీ A. V. గోపాలాచార్యస్వామి సంస్కృతవ్యాఖ్య

తిరుచిరాపల్లిలో న్యాయవాదిగా పేరు పొందిన, వేదాంతములలో గాఢమైన పాండిత్యమును కల శ్రీమాన్ A. V. గోపాలాచార్యులుగారు సంస్కృతభాషలో పూర్వశతకమునకు వ్యాఖ్యానము రచించిరి. ఈ వ్యాఖ్య 1934వ సం॥ము దేవరనాగరలిపిలో "**తిరువాడి**" లోని శ్రీనివాస ప్రెస్ లో ముద్రింపడినది. ఉత్తరశతకమునకు కూడ వీరు వ్యాఖ్యను రచించిరేమో, తెలియదు. లభించుటలేదు. ఈ వ్యాఖ్య ముఖ్యముగా స్తోత్రములోని వ్యంగ్యార్థములను తెలుపుటకై ఉద్దేశింపబడినది.

**"సుదుర్బోధా వ్యంగ్యఘనా భట్టార్యాణా మియం స్తుతిః,**
**భావలేశో చేత్ భాతః స కటాక్షైకలంభితః"**

అను వ్యాఖ్యలోని చివరి శ్లోక మీ విషయమును వ్యక్తము చేయుచున్నది. ఈ వ్యాఖ్యలో కూడ పలు పాఠభేదములు, అన్వయవిశేషములు కనుపించుచున్నవి. వ్యాఖ్యానకర్త పలు శాస్త్రములలో నిష్ణాతుడే కాక, శ్రీవైష్ణవస్తోత్రవాఙ్మయమున, సిద్ధాంతమున పాండిత్యమును కలవారు. మరియు, దేశికుల శ్రీస్తుతి, దశావతారస్తోత్రము, గోపాలవింశతి స్తోత్రములకు వీరు వ్యాఖ్యను రచించిరి. తిరువాడినుండి వెలువడిన ఉద్యానపత్రికలో వీరి పలు వ్యాసములు ప్రచురింపబడినవి. వానిలో మేఘసందేశము, హంససందేశములనుగూర్చి విశ్లేషణాత్మకమగు "**సందేశద్వయసారాస్వాదినీ**" పేరెన్నిక గన్నది. ఈ వ్యాఖ్యానకోశమును ప్రొఫెసర్ శ్రీమాన్ K. E. గోవిందన్, (రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠము, తిరుపతి) గారు దాసునకు అనుగ్రహించిరి.

అందులకు వారికి ఎంతయో కృతజ్ఞుడను. యథావకాశముగా వరివస్యలో ఇందలి విశేషములు చూపబడినవి.

(IV) శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి మణిప్రవాళవ్యాఖ్య:–

**"అణ్ణావప్పఙ్గార్"** అను పేరుతో సంప్రదాయములో ప్రసిద్ధులగు శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి మణిప్రవాళశైలిలో అత్యంతమధురముగా, నాది విస్తృతముగా శ్రీరంగరాజస్తవమునకు ఒక వ్యాఖ్యను రచించిరి. వీరు సామాన్యశాస్త్రములందేకాక, ఉభయవేదాంతములందును సాటి, మేటి లేని వైదుష్యమును కలవారు. వీరి జన్మస్థలము చెన్నపురికి సమీపమున గల మహీసారపురము (తిరుమழிశై). వీరు పూర్వదినచర్య, ఉత్తరదినచర్య, యతిరాజవింశతి, శ్రీవరవరమునిశతకము, నక్షత్రమాలిక మొదలగు శ్రీవైష్ణవస్తోత్రములకు, భవభూతికృత ఉత్తరరామచరితముకు చక్కని వ్యాఖ్యలను రచించుటయేకాక, శ్రీవచనభూషణమునకు శ్రీమణవాళమహాామునులు రచించిన వ్యాఖ్యకు అతివిస్తృతనుగు అరుమ్బదమును కూర్చిరి. **"శ్రీభాష్యాదిసూక్తిసాధుత్వమాలికా"**, అను పేరుతో శ్రీభాష్యశ్రుతప్రకాశికాది పూర్వాచార్యగ్రంథములలోని పూర్వాచార్యుల ప్రయోగముల సాధుత్వమును సమర్థించుచు గొప్ప గ్రంథమును ఒకదానిని అనుగ్రహించిరి. ఇది, వరంగల్ వాస్తవ్యులు, మహామహోపాధ్యాయ, ఉ. వే. శ్రీమాన్ ఎస్. ఎన్ సి రఘునాథా స్వామివారిద్వారా పరిష్కృతమై, వారి సంస్థద్వారా ముద్రింపబడినది. శ్రీరంగరాజస్తవమునకు వీరు రచించిన వ్యాఖ్య శ్రీనికేతనముద్రాక్షరశాలలో శ్రీమాన్ మాడభూషి శ్రీనివాస రాఘవాచార్యస్వామి సంపాదకత్వమున మన్మథ సంవత్సరము (1895) న ప్రచరింపబడినది. సంస్కృతశ్లోకములు గ్రంథలిపిలో, వ్యాఖ్యానము తమిళలిపిలో ముద్రింపబడినది. ఇందు పలు పాఠభేదములు, అన్వయవిశేషములతోపాట, ప్రయోగసాధుత్వములును చూపబడినవి. ఈ వ్యాఖ్య, శ్రీగోపాలాచార్యవ్యాఖ్యయు ప్రస్తుత వ్యాఖ్యానము ముద్రింపబడు సమయమున లభించుటచే, వానిలో గల కొన్ని విశేషములు మాత్రము చూపుటకు సాధ్యపడినది.

(V) మహావిద్వాన్ శ్రీమాన్ ప్ర. భ. అణ్ణంగరాచార్యస్వామి ద్రావిడవ్యాఖ్య–

నాలాయిర దివ్యప్రబంధములకు, రహస్యగ్రంథములకు, పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రములకు రసఘనములైన వ్యాఖ్యలను అనుగ్రహించినవారును, తమ మృదుమధుర వాక్కులతో ఆసేతు హిమాచలము రంజింపచేసినవారును, ద్రావిడ భాషలో **"శ్రీరామానుజన్"** తెలుగులో "శ్రీరామానుజ పత్రిక", సంస్కృతభాషలో **"వైదిక మనోహరా"** వంటి మాసపత్రికల ద్వారా ఈ శతాబ్దమున శ్రీరామానుజ సిద్ధాంతమును, సంప్రదాయమును ప్రచారమొనర్చి, వాటికి ఎనలేని సేవచేసినవారును, మహామహిమోపాధ్యాయ, పద్మవిభూషణవంటి బిరుదములకు శోభను తెచ్చినవారగు కాంచీ మహావిద్వాన్ ఉ. వే. శ్రీనూన్ ప్ర. భ. అణ్ణంగరాచార్యస్వామి శ్రీరంగరాజస్తవమునకు ద్రావిడభాషలో "తత్వార్థచింతామణి" అను పేరుతో వ్యాఖ్యను రచించిరి. ఈ వ్యాఖ్య అన్వర్థమైనది. పలు ముద్రణలను పొందుట దీనికి గల బహుళప్రచారమును తెలియజేయుచున్నది. ఇందు పలు పాఠభేదములు, వాని సామంజస్యములును చర్చింపబడినవి. భట్టరు సూక్తులకును, దివ్యప్రబంధవాఙ్మయమునకును మధ్య గల అర్థసాదృశ్యములు పలుచోట్ల చూపబడుట ఈ వ్యాఖ్యలో ప్రధానమైన వైశిష్ట్యము. వరివస్యలో ఇందలి వివరణము చాల వరకు గ్రహింపబడినది. ఇందులకు దాసుడు శ్రీస్వామికి, వారి వంశమువారికి ఎంతయో కృతజ్ఞుడు. పూర్వశతకవ్యాఖ్య తెనుగులిపిలో శ్రీస్వామి నడపిన శ్రీరామానుజపత్రికలో ధారావాహికముగా ప్రచురింపబడినది.

(VI) శ్రీమత్పరవస్తు గోవిందాచార్యస్వామి విజయనగరం మహారాజా సంస్కృతకళాశాలలో సంస్కృతపండితులుగా పనిచేసిరి. వీరు ఉభయవేదాంతపారంగతులు. శ్రీవైష్ణవులు నిత్యము అనుసంధించుకొను స్తోత్రములలో 20 స్తోత్రములకు వీరు ప్రతిపదార్థ తాత్పర్యములను తెనుగున **"శ్రీవైష్ణవస్తోత్రమాల"** అను పేర 1962వ సం. న రచించిరి. అందు శ్రీరంగరాజస్తవము. కూడ వ్యాఖ్యానింపబడినది. ఈ వ్యాఖ్య ప్రాయికముగా

శ్రీవేంకటాచార్య సంస్కృతవ్యాఖ్యానమును అనుసరించి వ్రాయబడినను, అచట అచట అన్వయభేదములు, సంస్కృతశ్లోకములకు ద్రావిడపాశురములకు గల సాదృశ్యములును క్లుప్తముగా తెలుపబడినవి. ఈ గ్రంథమునకు సుగృహీత నామధేయులు, శ్రీరామాయణ రహస్యజ్ఞులు, ఉ. వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు రచించిన ఆముఖము ప్రత్యేకమైన శోభను చేకూర్చినది.

(VII) పైన పేర్కొనబడిన వ్యాఖ్యలే కాక మరికొన్ని వ్యాఖ్యలు కూడ ఉన్నట్లు పరిశీలనలో వెల్లడియగుచున్నది.

(a) శ్రీగార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యలో పూర్వశతకములోని "రామానుజమునిః" అను మూడవ శ్లోకవ్యాఖ్యానమున, "దోషాపధావధిసమాన్" అను 27వ శ్లోకవ్యాఖ్యానమున "వేదాంతాచార్యపుత్రైః వరదాచార్యై రేవం వ్యాఖ్యాతమ్" అని యుండుటచే, శ్రీవేదాంతదేశికుల పుత్రులగు శ్రీనయన వరదాచార్యులవారిచే శ్రీరంగరాజస్తవమునకు ఒక వ్యాఖ్యానము రచింపబడినదని తెలియుచున్నది. శ్రీరంగరాజస్తవ వ్యాఖ్యలన్నిటిలో బహుశః ఇదియే ప్రాచీనము కావచ్చును. ఈ ఆచార్యులు శ్రీమణవాళ మహామునులకు గల, అష్టదిగ్గజములను శిష్యులలో ఒకరగు ప్రతివాది భయంకరమ్ అణ్ణన్ కు శ్రీభాష్యాది సంస్కృతవేదాంతశాస్త్రగ్రంథములను బోధించిరి. వీరు కోకిలసందేశము, శుకసందేశము, వేదాంతదేశిక మంగళాశాసనము మొదలగు పలు కృతులను రచించినట్లు తెలియుచున్నది. ఈ వ్యాఖ్య ప్రస్తుతము లభ్యమగుటలేదు.

(b) "కృపయా పరయా" (98), "ఆమౌళిరత్నమకరాత్" (83) మొదలగు పూర్వశతక శ్లోకములో గల శ్రీగార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యలో

పూర్వాచార్యుల యోజనాంతరములు ప్రస్తావింపబడుటచే, ఇంకను పలువురు శ్రీరంగరాజస్తవమును వ్యాఖ్యానించినట్లు ఏర్పడుచున్నది.

"తార్ క్ష్యపక్షతివత్" (54) అను శ్లోకమును వ్యాఖ్యానించుచు శ్రీ ప్ర. భ. అణ్ణాస్వామి పలు వ్యాఖ్యలలోని అన్వయాంతరములను ప్రస్తావించిరి. దీనివలనకూడ ఈ స్తోత్రమునకు చాలా వ్యాఖ్యానములు రచింపబడినట్లు తోచుచున్నది.

(c) నాలాయిర దివ్యప్రబంధవ్యాఖ్యానములలో పలు చోట్ల పలువురు ఆచార్యులు శ్రీరంగరాజస్తవ శ్లోకములను ప్రమాణములుగా ఉట్టంకించుటయే గాక, అచట అచట ఆ శ్లోకములను పూర్తిగానో, పాక్షికముగానో వ్యాఖ్యానించిరి కూడ. తిరువాయ్ మొళిలోని "శెయ్యతామరై" (3-6) అను దశకమునకు నమ్బిళ్లై ఈడు వ్యాఖ్యలో ఉత్తరశతకములోని "అస్తాం తే" అను 74వ శ్లోకము పాక్షికముగా వ్యాఖ్యానింపబడుట ఇందుల కొక ఉదాహరణము. అట్టి వ్యాఖ్యలలో కొన్ని విశేషాంశములు చూపట్టుచున్నవి. వరివస్యలో అక్కడక్కడ అవి ప్రస్తావింపబడినవి.

(d) ఇట్లే, ఈడు వ్యాఖ్యకు గల అరుమ్బదములలో పలు శ్రీరంగరాజస్తవశ్లోకములు ఉదాహరింపబడుట, కొన్ని వ్యాఖ్యానింపబడుటయు కానవచ్చుచున్నది. ఈడు ప్రవేశమునకు అరుమ్బదములో "రంగభర్తుః" అను పూర్వశతకములోని 88వ శ్లోకము వ్యాఖ్యానింపబడుట ఇచట ఒక నిదర్శనము.

ఇట్లే, "ఇతో బహిః" అను శ్లోకమును ఈడు అరుమ్బదములో వ్యాఖ్యానింపబడినది.

(e) అడైయార్ గ్రంథాలయగ్రంథసూచిలో 71324 సంఖ్యగల తాళపత్రగ్రంథము మణిప్రవాళ శైలిలో రచింపబడిన శ్రీరంగరాజస్తవవ్యాఖ్యగా చూపబడినది. కర్తపేరు దాశరథిగా తెలుపబడినది.

(f) శ్రీవేంకటేశ్వర ప్రాచ్యలిఖిత తాళపత్ర గ్రంథాలయములో 69-70వ సంఖ్య గల తాళపత్రగ్రంథము సంస్కృతభాషలో రచింపబడిన శ్రీరంగరాజస్తవవ్యాఖ్యగా కన్పించుచున్నది. వ్యాఖ్యానకర్త వేంకటనివాసుడు.

(g) బహుగ్రంథకర్తలు, విద్వద్వరేణ్యులు అగు కవిభూషణమ్ అద్దంకి తాతాచార్యస్వామి శ్రీరంగరాజస్తవమునకు విపులమైన వ్యాఖ్యను రచించినట్లు తెలియుచున్నది. కానీ, ఈ వ్యాఖ్యను గూర్చి Catalogous Catalogorum లోగూడ ప్రస్తావన లేకుండుట విశేషము.

పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రములకు, వాని వ్యాఖ్యానములకు పాఠశోధనలతో కూడిన సమీక్షాత్మకములైన సంస్కరణములను సంపాదింపవలసిన ఆవశ్యకత ఎంతయినను కలదను అంశమును గుర్తించిన గురువర్యులు, న్యాయశిరోమణి, ఉభయవేదాంతవిద్వాన్, ఉ. వే. శ్రీమాన్. T. A. కృష్ణమాచార్యస్వామివారు, (విశ్రాంతన్యాయశాఖాధ్యక్షులు, శ్రీవేంకటేశ్వర సంస్కృత కళాశాల, తిరుపతి), రాష్ట్ర పతిపురస్కారగ్రహీత, సాహిత్యశిరోమణి, వాచస్పతి, డా॥ ఉ. వే. శ్రీమాన్ N. C. V. నరసింహాచార్యస్వామి (ఎక్స్ స్పెషల్ ఆఫీసర్, భాగవతప్రాజెక్టు, టి. టి. డి. , తిరుపతి) వారలు ఇద్దరు కలసి శ్రీవీరరాఘవాచార్యకృత వసురాశినామక శ్రీగుణరత్నకోశ సంస్కృతవ్యాఖ్యానమునకు, శ్రీవేంకటాచార్యకృత శ్రీరంగరాజస్తవ సంస్కృత వ్యాఖ్యానమునకు పాఠశోధనలతో కూడుకొనిన అమూల్యమైన సంస్కరణ ప్రతులను సుమారు 10 సం॥లకు పూర్వమే సిద్ధపరచిరి. వీరి ఈ సంస్కరణమున పలు మూల శ్లోకములలో కొన్ని అపూర్వములైన పాఠపరిష్కారములను చూపిరి. ఉదాహరణకు, 123వ శ్లోకములోని "నవై"అను పాఠమునకు **"స్తవై"** అను పాఠాంతరమును, 125వ శ్లోకమున **"ఘుష్యద్భిః"**అనుటకు **"ఘోషద్భిః"** అను పాఠాంతరమును సూచించిరి. 36వ

శ్లోకమున "**ప్రణమేమహి**" అను రూపమును ఒకే క్రియాపదముగాకాక, "**ప్రణమేమ**", "**హి**" అను రెండు పదములుగా సూచించిరి. వరివస్యలో అందలి పాఠములు. పలుచోట్ల స్వీకరింపబడినవి. ఇందులకు దాసుడు ఆ మహనీయులు ఇరువురకు. వినయపూర్వకముగ కృతజ్ఞతాంజలులను సమర్పించుకొనుచున్నాడు.

కర్ణాటకరాష్ట్రము మేల్కోటైలోని సంస్కృతపరిశోధనపరిషత్ ద్వారా కవిశాబ్దికకేసరి, న్యాయవ్యాకరణాది పలు శాస్త్రములలో నిష్ణాతులగు ఉ. వే. శ్రీమాన్ S. N. C. రఘునాథాచార్య స్వామివారు సంస్కరించిన వసురాశినామక శ్రీగుణరత్నకోశవ్యాఖ్య ప్రచురింపబడుట ఈ సందర్భమున స్మరింపతగినది.

మిత్రులు, శ్రీమాన్ డా॥ T. V. రాఘవాచార్యులు (రీడర్, R. S. విద్యాపీఠం, తిరుపతి), గారి పర్యవేక్షణలో మిత్రులు శ్రీమాన్ M. T. ఆళ్వార్ గారు శ్రీవేంకటాచార్యకృతమగు శ్రీరంగరాజస్తవవ్యాఖ్యనుగూర్చి సమీక్షాత్మకనుగు పరిశోధనను చేసిరి. అట్లే, గురుతుల్యులు ప్రొఫెసర్ శ్రీమాన్ K. E. గోవిందన్ (R. S. విద్యాపీఠం, తిరుపతి) గారి పర్యవేక్షణలో వేరొక సంస్కృత పండితులు శ్రీమాన్ రంగాచార్యులుగారు శ్రీగార్గ్య రామానుజాచార్యవ్యాఖ్యను గూర్చి సమీక్షాత్మకమైన అధ్యయనము చేయుచుండుట శ్రీవైష్ణవలోక మంతటికిని ముదావహము. అస్మద్గురువర్యులు ప్రొఫెసర్ శ్రీమాన్ L. N. భట్, సాహిత్యశాఖ, (R. S. విద్యాపీఠం, తిరుపతి) వారి పర్యవేక్షణలో శ్రీరంగరాజస్తవమునకు శ్రీవేంకటాచార్యులు సంతరించిన సంస్కృతవ్యాఖ్య సంస్కరింపబడుచున్నది. ఈ విధముగానే మిగిలిన పూర్వాచార్యస్తోత్రవాఙ్మయమునుగూర్చి సమగ్రపరిశోధన జరుగగలదని ఆశింతము గాక!

అస్మత్పితామహపాదులగు ఉ. వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్యస్వామివారి శతాబ్దపూర్త్యుత్సవ శుభసందర్భమునకు స్మారకముగ ప్రచురింపబడు ఈ వరివస్యా వ్యాఖ్యాన సహిత శ్రీరంగరాజస్తవ పూర్వశతకగ్రంథమున ఆ మహనీయుల వైభవసంగ్రహము ప్రత్యేకముగ ఈయబడినది. వారి కరకమలముల మీదుగ శ్రీరంగనాథుని పాదారవిందసన్నిధిలో ఈ వరివస్యావ్యాఖ్య సమర్పింపబడుచున్నది. "పరిచిత మివాథాపి గహనమ్" అనునట్లు ఎంత తెలిసినట్లున్నను దురవగాహముగ తోచు భట్టరు శ్రీసూక్తులను, ప్రత్యేకించి నా వంటి అల్పజ్ఞుడు, వివరింపనెంచుట సాహసము, దుస్సాహసము. పరిహాస్పదమును, అయినను, "సంబంధాత్ స్వాత్మలాభః" అను కవివచనమును, "మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః" అను కాళిదాస సూక్తిని అలంబనముగా గొని, పెద్దలు చూపిన మార్గమున యథాశక్తి వాగ్రూపకైంకర్యమును శ్రీరంగనాథుని పాదపద్మములకు చేసి, ఆత్మలాభమును పొందవలెను అను పేరాసయే నన్ను ఈ సాహసమునకు పురికొల్పినది. వాత్సల్యమూర్తులు, గుణగ్రహపారీణులు అగు పెద్దలు ఇందలి దోషములను మన్నింతురని నమ్ముచున్నాను. ఇందలి దోషములన్నియు దాసునివే అని, గుణములున్నచో అవి అన్నియు అస్మదాచార్యుల అనుగ్రహఫలములేనని సవినయముగ నివేదించుకొనుచున్నాను. స్వస్తి.

తిరుపతి,<br>21-3-99<br>(ప్రథమ ముద్రణ)

భాగవతవిధేయుడు,<br>ఈ. ఏ. శింగరాచార్యులు.



## శ్రీవేంకటేశ్వర పరబ్రహ్మణే నమః

1)శ్రీరంగనాయకం నౌమి వేంకటాద్రినివాసినమ్,
ప్రణతార్తిహరం దేవం యాదవాద్రివిహారిణమ్.

2) శ్రీశం లక్ష్మీం చ సేనాధిప మథ శఠజిద్యోగివర్యం చ నాథం
యోగీంద్రం యామునార్యం తదను యతిపతిం సౌమ్యజామాతృమౌనిమ్,
పూర్వం చాచార్యవర్గం గురువర మనఘం శేషసింహాభిధం, తత్–
పుత్రం సేవే గురుం మే పితర మధిగుణం రంగరామానుజార్యమ్.

3) శ్రీవత్సాంకసుతః పరాశరగురుః శ్రీరంగరాజస్తవం
చక్రే, య శ్శతకద్వయాత్మకతయా వ్యాఖ్యాతి మంత్రం ద్వయమ్,
సన్మార్గం విదుషాం స్మరన్ వివృణుతే తం శ్రీశింగరార్యాహ్వయో
భారద్వాజభవోఽయ మాంధ్రవచసా సంసేవితుం రంగిణమ్.

4) శ్రీమద్భట్టారకాణాం రసగుణరుచిరా వ్యంగ్యపూర్ణా చ సూక్తిః
శ్రుత్యంతార్థైః గభీరా క్వ? మమ మతిరియం క్వాల్పశక్తిః?, తథాపి,
సంబంధాత్ స్వాత్మలాభో భవతి ఖలు, కవే ర్వాక్యమత్ర ప్రమాణం
తస్మాత్ సోఢవ్యమేతత్ సహృదయమణిభిః వత్సలైః సాహసం మే.

5) శ్రీరంగేశ్వర! రమయతు తావకపదసరసిజవరివస్యా మే,
శ్రీశేషసింహగురువరకరకమలాభ్యాం సమర్ప్యమాణా త్వామ్.

6) ప్రథమం వివృణోమ్యర్థం తదుపరి భావం విశేషసహితం చ,
దివ్యప్రబంధవచసాం సౌసాదృశ్యం చ దివ్యసూరీణామ్.

